వినోదా పబ్లికేషన్స్‌వారి ప్రచురణ

# అమల



సంపాదకులు: వి. ఆర్. భవాని

# అమల

మూలం :

శ్రీ ఉపేంద్రనాథ్ గంగోపాధ్యాయ

అనుసరణ :

'వల్లభ్'

వినోదా పబ్లికేషన్స్
విజయవాడ - 2

డాక్టరు సి. సాంబశివరావుగారూ !

ఓ రోజున నేను మిమ్మల్ని వెతుక్కుంటూ వచ్చాను. నేను ఆశించిన సహృదయత మీ వద్ద లభించింది. అప్పటినించి యిప్పటివరకు, కాదు, కాదు, ఎల్లప్పటికీ యిప్పుడే లభించిన మీ సానుభూతికి కృతజ్ఞతను తెలియజేస్తూ దీనిని మీకే యిస్తున్నా. స్వీకరించండి!

—'వల్లభ్'

# మనవి!

ఆంధ్రదేశం పుత్తడిబొమ్మ పూర్ణమ్మను మరచిపోదు. ఆమె ఆనాటి సాంఘిక దురాచారాలకు గురై 'జీవితా'న్ని అను అనుభవించలేకపోయింది. చివరకు ఆమే ఓ ఉద్యమంగా బయలుదేరి నవసమాజ నిర్మాణానికి కృషి చేసింది. తత్ఫలితంగా సమాజంలోమార్పువచ్చింది; మార్పుతో పాటు క్రొత్త సమస్యలూ బయలుదేరినై. ఆ సమస్యల్లోనే మునిగి తేలుతున్న 'అమల' ఆంధ్రదేశంలో అడుగు పెడుతోంది. ఈమెను అర్థంచేసుకొని ఆదరించవలసిన వారు ఆంధ్రులు. ఆడపడుచులంటే ఎంతో ఆదరంచూపే ఆంధ్రులు ఈమెను తప్పక ఆదరిస్తారని ఆశిస్తున్నాం.

—సంపాదకులు.

శీతాకాలం. ఐదవటం ఆలస్యం, ప్రొద్దుకూకుతుంది. హరిమోహన ముఖర్జీ ఆఫీసునుంచి వచ్చీ రావటంతోటే — "కొంచెం ఆ శాలువ ఇలా అందుకో! నే నిప్పుడే వస్తా!" అన్నాడు, భార్య ప్రభావతితో.

ఆ రోజున ఆఫీసునుండి వస్తూనే భర్త చిరాకుగా వున్న సంగతి గమనించింది ప్రభావతి. కారణం అడిగి తెలుసు కుందామనుకునే మళ్ళీ ఎందుకనో ఆగిపోయింది. కాని, ఆయనే స్వయంగా బయటకు వెళ్ళాలని చెప్పినపుడు తన సందేహాన్ని బయట పెట్టింది – "ఏమిటి, ఇవాళ అలా వున్నారు ? ఈ చలిలో ఇప్పుడు ఎక్కడ కెళతారు?" అంటూ.

హరిమోహనముఖర్జీ ఉదాసీనంగా – "అమల అత్త వారింటిదాక వెళ్ళి రావాలి. ఇవాళ ఉదయమే నేను ఆఫీసు కెళుతూంటే కుర్రాడు ఎదురొచ్చి ఉత్తరం యిచ్చిపోయాడు. కోటు జేబులో ఉంది, చూడు!" అన్నాడు.

ప్రభావతి వెంటనే ఉత్తరం తీసి చదివింది. అమల మామగారు గోవిందనాథ్ వ్రాశారు – "తనకున్న కళంకాన్ని కప్పిపుచ్చి, వ్యవహరించే మనిషిని నేను నీచునిగా భావిస్తాను.

నా ఇంట్లో వర్ణసంకరుని కూతురికి స్థానం లేదు, వుండదు, వుండబోదు : మీ అమ్మాయిని మా అబ్బాయికి చేసుకొని నేను కూడ సంఘానికి దూరమయ్యాను. మళ్ళీ ప్రాయశ్చిత్తం చేసుకొని యథా స్థానాన్ని సంపాయించుకోవాలి. ఇవాల్టినుంచి మీకూ మాకూ ఎట్టి సంబంధం లేదు. మా వాడికి రెండో పెళ్ళికి ఏర్పాట్లు చేసుకుంటున్నాను. మీ రివాళ సాయంత్రం లోగా స్వయంగావచ్చి మీ అమ్మాయిని తీసుకెళ్ళండి! మీరు తీసుకెళ్ళని పక్షంలో నేనే పంపుతాను."

అమల వివాహమై మూడు మాసాలైంది. ఆమె మామ ఈ ఇరవయ్యో శతాబ్దంలో వుంటూ కూడ 'హిందూ ధర్మా'న్ని తు. చ. తప్పకుండా అనుసరించే మనిషి. ఆయన యీ విషయంలో ఏ మాత్రం మార్పుని కూడ అంగీకరించడు. కనుకనే వియ్యంకుని గురించి విన్నసంగతి సత్యాసత్యాలను తెలుసుకొనే వరకు విశ్రమించలేదు. ఈ రోజునే ఉదయాన కళంకం వున్న సంగతి నిజమేనని ఆయనకు తేలిపోయింది. వెంటనే వియ్యంకునిపేర ఓ ఉత్తరం వ్రాసి నౌకరి కిచ్చి పంపాడు.

ఆయన వ్రాసిన ఉత్తరాన్ని చదివి ప్రభావతి ఖిన్నురాలైంది. ఆమె నాడులన్నీ ఒక్కసారి కుంగిపోయినై. హరిమోహనుని తండ్రి గురించి నల్గురూ నానా రకాలుగా చెప్పుకోవటం జరుగుతూ వుండేది. ఓ సారి దీనిని గు[illegible]చే ఓ పెద్ద రగడ జరగటం, దాని పర్యవసానంగా ఆయన [illegible] వాకిలీ వదలిపెట్టి కలకత్తా పారిపోయి రావటం జ[illegible]ది.

కలకత్తాలో సంఘం లేదు. ఇక్కడ అంతా స్వతంత్రులు. ఇక్కడ ఎవ్వరూ మరొకరి కులగోత్రాలు అడగరు. కనుకనే హరిమోహనుని తండ్రి కలకత్తావచ్చి నిర్విచారంగా జీవనం సాగించాడు. ఇక్కడ ఆయనిని వేలెత్తి చూపేవారు లేరు. ఆ తర్వాత ఏ గొడవా లేక పోయింది. కాని, హరి మోహనుని వివాహం చేయవలసి వచ్చినప్పుడు మాత్రం ఈ కళంకం అజలోకొచ్చింది. అయినా ఆయన మామ ఆ విషయాన్ని గురించి అంతగా పట్టించుకోలేదు. ఆ తర్వాత మరెప్పుడు ఆ సమస్య ఉదయించనే లేదు. గోవిందబాబు వ్రాసిన ఉత్తరంలో అదే సమస్య మళ్ళీ బయలుదేరిందని ప్రభావతి వెంటనే తెలుసుకుంది.

"మీారు అక్కడకెళ్ళి ఏం చేస్తారు ?" అని అడిగింది ప్రభావతి ఉదాసీనంగా.

"ముందు నచ్చచెప్పటానికి ప్రయత్నిస్తా. ఒప్పుకుంటా డేమో !..." _ అన్నాడు హరిమోహన్‌ముఖర్జీ.

"ఒప్పుకోకపోతే అమలను తీసుకొస్తావా ?"

"అంత తేలికగా మాత్రం తీసుకురాను. కాని, అవసర మైతే అమ్మాయిని అక్కడ ఉంచను కూడా."

"ఆ పని మాత్రం చేయకు ! ఇవాళ తీసుకొచ్చేవంటే ఇహ అక్కడకెళ్ళటానికి అవకాశమే ఉండదు. అక్కడకెళ్ళి కస్సు బుస్సు లాడకు ! నీకు కోపం ముక్కుమీాదే ఉంటుంది. ఎంతైనా నీవు ఆడపిల్ల తండ్రివి !"

# 8

"అయితే, అణగి మణగి ఉండాలనే దేముంది ? మంచీ చెడూ అవసరం లేదా ? ఏమన్నా పడి వుండాలనేనా సి ఉద్దేశ్యం ?"

ప్రభావతి పరిస్థితి క్రమంతిమించి రాగాన పడేలావుందని గమనించింది. మెదలకుండా వెళ్ళి శాలువ తెచ్చి యిచ్చింది. హరిమోహనముఖర్జీ దుర్గాదేవిని స్మరించి బయలుదేరాడు.

వెలింగటన్ స్క్వేర్ దగ్గరగా గోవిందబాబు మేడ ౦ది. హాలులో ఓ పెద్ద మంచం మీద ఓ ప్రక్కకు నడుం ాల్చి హుక్కా త్రాగుతున్నాడు గోవిందబాబు. ఆయనకు గ్గరలో కూచొని వినోద్‌చంద్రపాల్ టీ త్రాగుతున్నాడు.

గోవిందబాబు వినోద్‌పాల్ వంక అర్ధ నిమీలిత నేత్రాలతో చూస్తూ – "ఏమయ్యా ! నువ్వే చెప్పు ! ఈ మాట తెలిసిన తర్వాత కూడ ఆ పిల్లను ఇంట్లో ఎలా పెట్టుకొనేది ?" అన్నాడు.

వినోద్‌పాల్ ఒక్కసారి ఆయనవంక చూచి, మళ్ళీ దో పరధ్యానంలో వున్నట్టు జవాబివ్వక టీ సేవిస్తూ ూచున్నాడు.

గోవిందబాబు ఆయనవంక ఓ సారి కళ్ళనిండా చూచి – "పలుకవేమయ్యా ? ఊఁ త్వరగా తేల్చు ! నీవే నాస్థానంలో వున్నట్లైతే నీవు ఉంచుకో గలుగుతావా ?" అన్నాడు.

"అవును, నిజమేననుకో!... కాని, పిల్లకు చాల కష్టం కలుగుతుంది!" అన్నాడు వినోద్‌పాల్ నెమ్మదిగా అనో తరహాగా.

గోవిందబాబు ఒక్కసారి లేచి కూచొని – "దానికి నన్నేం చేయమంటావ్? అది లోకంలో జరుగుతున్నదేగా, తప్పుచేసేది ఒకరు, శిక్ష అనుభవించేది మరొకరు!" అన్నాడు.

వినోద్‌పాల్ జవాబివ్వకుండానే టీ త్రాగుతున్నాడు. ఇంతలో నౌకరు వచ్చి – "చిన్నమ్మగారి బాబుగారు వచ్చార"ని చెప్పాడు.

గోవిందబాబు – "పంపమ"ని ఆజ్ఞాపించి మళ్ళీ దిండు కానుకొని పడుకున్నాడు.

వినోద్‌పాల్ గాబరాపడుతూ – "అయితే ఇహ నేను వెళ్ళిరానా?" అన్నాడు.

"అదేలా? నీవు ఇక్కడ వుండాలని కాదూ, యీ చలిలో కబురు పెట్టింది! కూచో!" అన్నాడు గోవిందబాబు.

"నేను ఇక్కడ వుంటే మీకు కొంచెం బాధగా వుంటుందేమో!" అన్నాడు వినోద్‌పాల్.

"ఏం లేదు." అన్నాడు గోవిందబాబు.

నెమ్మది నెమ్మదిగా హాలులోకొచ్చి హరిమోహన్ తలవంచి గోవిందబాబుకి నమస్కారం చేసాడు. గోవిందబాబు

ప్రత్యాభివందనం చేయకుండానే వేలుతో ఓ కుర్చీ చూపించి కూచోమని సైగ చేసాడు.

హరిమోహన్ కూచున్న మీదట గోవిందబాబు – "బండి తీసుకొచ్చారాండీ!" అనడిగాడు.

"లేదండీ?" అన్నాడు హరిమోహన్ నెమ్మదిగా.

"ఎందువల్ల?" అనడిగాడు గోవిందబాబు.

ఏం చేయాలో తెలియని హరిమోహన్ ఓ సారి మౌనంగా వినోద్‌పాల్ వంక చూచాడు. వినోద్‌పాల్ ఆ చూపు భావమేమో గమనించి – "గోవిందబాబు! ఇహ నేను వెళ్ళి వస్తా!" అంటూ లేచి నిలబడ్డాడు.

గోవింద్‌బాబు – "లేదు, లేదు. కూచో. నీవు ఇక్కడ వుండాలనేగా కబురంపింది! ఇందులో దాయవలసిన రహస్యం మాత్రం ఏముంది?" అన్నాడు త్వర త్వరగా. ఆ తర్వాత హుక్కా గొట్టం అందిస్తూ "ఇదిగో! ఓ దమ్ము వేయి!" అన్నాడు.

వినోద్‌పాల్ హరిమోహనుని వంక సైగచేసి – "ముందు వారిని త్రాగనివ్వు!..." అని అంటూ ఉండగానే గోవింద బాబు మధ్యలోనే ఆపి – "ఇక్కడ నానా గోత్రాలవారికి హుక్కా లేదు. వారికి కావాలంటె బజారునుండి తెప్పిద్దాం. ముందు నీవు త్రాగు!" అన్నాడు.

ఆయన మాటలు హరిమోహనుని హృదయంలో బల్లెంలా గుచ్చుకున్నై. ఆయన హృదయంలో ఒక్కసారి

అగ్నిజ్వాలలు భగ్గుమన్నై. కాని, ఆ మరుక్షణంలోనే ఆయన తమాయించు కున్నాడు.

వినోద్‌పాల్ గోవిందబాబు నడిచిన తీరు చూచి అసహ్యించుకున్నాడు. మారు మాట్లాడక హుక్కా పీలుస్తూ కూచున్నాడు.

హరిమోహనుని వంక ఓ సారి క్రీగంటి చూపుతో చూచి – "బండి తీసుకురాకుండా వచ్చారు. మీఅమ్మాయిని నడిపించి తీసుకెళ్తారా? ఒక వేళ డబ్బుగురించి మీరలా అనుకుంటూంటే నాకేం అభ్యంతరం లేదు... కాని, చాల దూరం పోవాలి. కనుక బండి తప్పక కావాలి" అంటూనే నౌకర్ని పిలిచి బండి తీసుకురమ్మన్నాడు.

దెబ్బమీద దెబ్బ తినేటప్పటికి హరిమోహనుని మనస్సు చికాకు చెందింది. ఆయన గోవిందబాబుని ఖుషామద్ చేసి సంతృప్తి పరచలేమనుకున్నాడు. కాని, తాను ఆడపిల్ల తండ్రినన్న సంగతి మరిచే పోలేకపోయాడు. చివరికి మరోసారి చెప్పిచూద్దామని అనుకున్నాడు. కాని, వినోద్‌పాల్‌ను చూచి సంకోచంతో ఆగిపోయాడు. చివరికి ఎలాగైతే యేం మనస్సునంతా చిక్కబట్టుకొని నెమ్మదిగా అన్నాడు – "మీ ఉత్తరం చూచి ఒక్కసారి దిగ్భ్రాంతుడనయ్యాను. మీరను కునేది నిరాధారమైనది. నేనంటే గిట్టని వాళ్ళెవరో మీకు అలా చెప్పి వుంటారు. మీలాంటి తెలివిగలవారు, మంచీ చెడూ తెలిసిన వారూ..."

హరిమోహనుని మధ్యలోనే ఆపి, గోవిందబాబు – "నా గురించి మీ కలాంటి అభిప్రాయం వుంది.. కనుక చెబుతున్నాను. నే నా విషయాన్ని గురించి తెలుసుకోవటానికి యెన్నో రకాలుగా ప్రయత్నించాను. మీ స్వగ్రామానికి కూడ మనుషుల్ని పంపాను." అన్నాడు.

"అక్కడ కూడ నాకు కావలసినంతమంది శత్రువులు వున్నారు. వారు అనవసరంగా వేసిన కళంకమేగాని మరో నాటి కాదు" అన్నాడు హరిమోహన్.

"బలే బాగా చెపుతున్నారే ! పెద్దమనుషుల్ని నమ్మక, న్మల్ని ఎలా నమ్మటం ?" అన్నాడు గోవిందబాబు ఎత్తి మస్తూ.

హరిమోహన్ ఇహ తనను సంబాళించుకోలేక పోయాడు – "అయితే, మీరనేది నేను చెడ్డవాడిననేగా ?" అనడిగాడు.

"ఇహ సందేహం కూడానా ? అబద్ధాలు చెప్పి, మోసపుచ్చి ఓ సద్బ్రాహ్మడి ధర్మాన్ని గంగలో కలిపిన మనిషిని అంతకంటే ఏమనాలి ? నేను మాలా మాదిగా – ఎవరైనా మంచివాడని చెప్పగలను. కాని మిమ్మల్ని మాత్రం అలా అని పిలవలేను" అన్నాడు గోవిందబాబు.

గోవిందబాబు మాటలు విని, వినోద్‌పాల్ లో లోనే కుళ్ళిపోయాడు. అతడు పైకి చూస్తూ ఉదాసీనంగా – "గోవిందబాబు ! అనవసరంగా గ్రంథాన్ని పెంచుకున్నందు

వల్ల ఏం ప్రయోజనం లేదు. నీవు చేయాలనుకున్న పని ఎలాగు చేస్తావు. దాని కోసమని ఓ మనిషి మంచీ చెడూ..." అని అంటూ ఉండగానే గోవిందబాబు ఉత్తేజితుడై – "నీవు తప్పు చేస్తున్నావ్ వినోదబాబు! గోవింద చటర్జీకి ఒకర్ని గౌరవించటం తెలుసు. నీవు అనుకునేటంత నీచుడు మాత్రం కాదు. కాని..." అన్నాడు.

వినోదబాబు మధ్యలోనే గాబరా పడుతూ – "జరిగి పోయిందేదో జరిగిపోయిందనే చెప్పాను. కాని, జరిగినదానిని తిరిగి తోడమని చెప్పలేదు" అన్నాడు.

గోవిందబాబు మాట్లాడుతున్న ధోరణిచూచి హరి మోహన్ ఆత్మస్థైర్యాన్ని కోల్పోయాడు. సహనం పోయింది. ఓప్రక్క సమక్షంలో జరుగుతున్న అవమానం, మరోప్రక్క కూతురికి జరిగే అశుభం – వీటి రెంటిమధ్య నలిగిపోతున్న ఆయనలో ఆత్మాభిమానం ఒక్కసారి ఉవ్వెత్తున లేచి గగ్గోలు పెట్టింది. వినోదబాబు ఆయన పక్షం వహించే ఆ మాటలు అన్నాడు. తనను సంబాళించుకోవటానికి ఆయనకు మరో, అవకాశం చిక్కింది. అగ్నిజ్వాలలు భగ్గుమనేందుకు సిద్ధమయ్యే, ఓ నీటిబొట్టు పడేప్పటికి చల్లారిపోయినై. ఆయన నెమ్మదిగా – "నేను నీచుడ్నే! పోనీ, మీకు తెలియకుండానే ప్రవర్తించాను. నేను చేసినది తప్పే ననుకుందాం. కాని, పిల్ల చేసిన తప్పేమిటి? ఆమెను కనికరించవచ్చుగదా?" అన్నాడు.

"ఓ మనిషి తప్పుచేయటం, మరోమనిషి శిక్ష ననుభ వించటం – ఇది లోకంలో జరుగుతున్నదే! మీ అమ్మాయిని

గురించి నా ధర్మాన్ని నేను వదలుకుంటానా?" అన్నాడు గోవిందబాబు.

హరిమోహన్ మండిపడ్డాడు – "జ్ఞాపక ముంచుకోండి ! ధర్మం పేరిట మా అమ్మాయి గొంతు కోయటానికి సిద్ధమైన మీరుకూడ ఓ రోజున తగిన శిక్ష ననుభవించాల్సి వస్తుంది. దానినుండి మీరుకూడ తప్పించుకోలేరు" అన్నాడు కర్కశంగానే.

గోవిందబాబు మొహం చిట్లించుకొని వికృతస్వరంలో "అవును ! నేనుకూడ అదే చెబుతున్నా; శిక్ష ననుభవించ వలసిందే ! కాని, మీరు అనేదేమిటో అర్థం కావటంలేదు. మీ పిల్ల నిరపరాధి అనేగా మీరనేది ? అలా అయితే ఓ బోగంపిల్లకూడ తనను నిరపరాధిగానే చిత్రిస్తే దాంట్లో ఆమె తప్పేమీ లేదు" అన్నాడు.

గోవిందబాబు యీ మాటల్లో ఎలాంటి ఉద్దేశ్యాన్ని కలిగి వుండకపోయినప్పటికీ, హరిమోహన్ మాత్రం తన భార్యను దృష్టిలో పెట్టుకొనే యీ మాటల్ని అంటున్నట్లు ఊహించుకొని అగ్గిలో గుగ్గిలంలా మండిపడ్డాడు. వ్యవహారం హద్దులు దాటిపోయిన తర్వాత, ఆయన తన కూతురికి జరగ బోతున్న అన్యాయాన్ని గురించి ఆలోచించలేక పోయాడు. పిచ్చివానిలా ఒక్కసారి – "నీలాంటి లుచ్ఛాఇంట్లో ఒక్క నిముషంకూడ వుండటం కష్టమే ! నా పిల్లను ఎంతత్వరగా అవతలకి తీసుకుపోతే అంత మంచిది. నేను ఈ నాటినుంచి ఆమె భర్త చనిపోయేడని అనుకుంటాను. నీలాంటి తుచ్ఛుడి

మోహం చూడటంకూడ ఘోరమైన పాపం!" అన్నాడు ఆవేశంతో హరిమోహన్.

గోవిందనాథ్ కోపంతో గడగడ వణికిపోతూ ఒక్కసారి లేచి మళ్ళీ కూచొని, హరిమోహన్ వంక తీక్షణంగా చూస్తూ – "నీకింత పొగరా ? వంటో ఓపిక లేదుగాని, అరుపులుకేం తక్కువలేదు. నా యింటో నన్నే అవమానిస్తావా ? నా యింటో పది పది హేనుమంది నౌకర్లున్నారు. వాళ్ళ కప్ప చెపితే నలిపేస్తారు సుమా ?" అంటూనే ఆయన బెగ్గరగా – "దేవీసింగ్!" అని అరిచాడు.

యజమాని కేక వినగానే వాడు వెంటనే హాలులో కొచ్చి నిలబడ్డాడు.

వినోదబాబు గాబరాపడుతూ – "గోవిందబాబు ! అదేమిటి, అలాచేస్తావ్ ? మతిలేకుండా పోయిందేమిటి ?" అంటూ దేవీసింగ్‌కి వెళ్ళిపొమ్మని సైగ చేశాడు.

వినోదబాబు మాటను లక్ష్యపెట్టకుండానే గోవిందనాథ్ చూపిడివేలుతో హరిమోహన్‌ని చూపుతూ – "ఈ యధవని అవతలకి గెంటేయి !" అన్నాడు.

హరిమోహన్ ఒక్కసారి సిగ్గుతోనూ, ఆత్మాభిమానంతోనూ కుంగిపోయాడు. కాని, ఆ మరుక్షణంలోనే దగ్గరలో వున్న కర్రను చేపట్టి, కండ్లెర్రచేసి దేవీసింగ్ వంక చూస్తూ – "జాగ్రత్త ! ఒక్క అడుగు ఇవతలకి వేసావా, ప్రాణాలు దక్కవ్!" అన్నాడు.

ఇంతలో ఓ బాలిక ఆయనముందు వచ్చి నిలబడింది. ఆమెను చూడగానే, చేతిలోకర్ర అవతల పారేసి ఆమె చేయి పట్టుకొని – "రా, అమ్మా! రా! ఈ యమకూపంలోనించి ఎంత త్వరగా బయటపడితే అంత మంచిది." అంటూనే ఆమెను తీసుకొని బయట నిలబడివున్న బండిలో కూచున్నాడు.

బండి చక్రాల గరగర ధ్వని దూరమైపోయిన తర్వాత గోవిందబాబు తలగడమీద వాలిపోతూ – "అమ్మ! ఇప్పటికి పాపవిమోచన మైంది!" అన్నాడు.

ఈ మాట విన్న వినోదబాబు మారు మాటాడకనే ఇంటికి వెళ్ళిపోయేందుకు లేచి నిలబడ్డాడు.

గోవిందబాబు – "ఇప్పుడే వెళ్ళిపోతావా? కూచో; అదుగో! హుక్కా! ఓ దమ్ము వేసుకో!" అన్నాడు.

వినోదబాబు – "ఇప్పటికే చాలా పొద్దుపోయింది. ఇహ వెళ్ళివస్తా!" అంటూ వెళ్ళిపోయాడు.

-

**అ**మల అత్తవారింటి దగ్గరనుండి పంపబడిన నాలుగైదు రోజుల తర్వాత మూడో ఝాముని గోవిందబాబు కుమారుడు విజయనాథ్ రెండో అంతస్థులోవున్న తన గదిలో కూచొని చిరాకుగా బయటకు చూస్తున్నాడు. అక్కడనుంచి వెలింగ్టన్ కొంతభాగం కనిపిస్తూ వుంటుంది. అక్కడ తక్కువ

కులాలకు చెందిన కొంతమంది గుమికూడి ఏదో విషయంమీద పోట్లాడుకుంటూ, తర్జనభర్జన చేసుకుంటున్నారు. కాని, అతని దృష్టి అటులేనేలేదు. ఈమధ్య కొద్దిదినాలనుండి అతని మనస్సు ఏదో బాధ ననుభవిస్తోంది! ఆ బాధలో అతనికి లోకం సంగతులేవీ పట్టడంలేదు. అతడు తటస్థంగా వుండి తన స్థితి ఏమిటో స్పష్టంగా తెలుసుకోవటానికి ప్రయత్నిస్తున్నాడు. ఆతని చిన్నతనంలోనే అమ్మ చనిపోయింది. అతనికి తోబుట్టిన వాళ్ళెవరూ లేరు. ఐనా, అతడు గారాబంగా పెరగలేదు. కట్టుదిట్టమైన పెంపకంలోనే పెరిగాడు, పెద్దవాడయ్యాడు. కాని, అప్పుడప్పుడుమాత్రం దూరపుబంధువైన వినోదిని వస్తూ, ఆ ఇంటి జీవితాన్ని ఆనందమయం చేస్తూ ఉండేది. కాని అది కూడ ఎప్పుడో? ఈ మధ్య అమల వచ్చిన తర్వాత అతని జీవితం కొత్తచిగుళ్ళను తొడుక్కుంది. కాని, అకస్మాత్తుగా ఆమె అతని జీవితాన్నుండి వైదొలగింది. మళ్ళీ యథాజీవనం! మండుతున్న గుండె! ఏదో తపనలో పడి కొట్టుకుంటున్న హృదయం!

అతడు యీ ప్రపంచాన్ని చూచి మండిపడ్డాడు. దుఃఖభారంతోనూ, ద్వేషానలంతోనూ కుంగిపోయాడు. కుంగిపోతూ, మండిపడుతూ గదిలో కూచొని కుళ్ళిపోతు న్నాడు. ఇంతలో ఎవరో నడచిన చప్పుడైై వెనక్కు తిరిగి చూచాడు. నౌకరు.

"బాబుగారూ! మిమ్మల్ని పెద్దదొరగారు పిలుస్తున్నారు" అన్నాడు నౌకరు.

"ఎందుకు ? ఏంపని?"

నౌకరు జవాబివ్వలేక పోయాడు.

ఓ క్షణంపాటు మంచంమీద పడుండి, విజయనాథ్ అయిష్టంగా లేచి తిన్నగా పోయి హాలులో గోవిందబాబు ఎదుట హాజరయ్యాడు.

గోవిందబాబు హాలులో ఒంటరిగానే కూచొని వున్నాడు. విజయని చూచి – "కూచో!" అన్నాడు.

విజయనాథ్ కూచోకుండానే రెండోపక్కకి మొహం పెట్టుకొని నిలబడ్డాడు.

"నేను నీకు ఓ పెళ్లిసంబంధం చూచాను. ఏర్పాట్లన్నీ ఐపోయినై. రేపు మాఘమాసం శుద్ధపంచమికి లగ్నంకూడ పెట్టుకున్నాం" అన్నాడు గోవిందనాథ్ భూమిక కట్టకుండానే, చెప్పవలసినదేదో చెప్పినట్టు.

విజయనాథ్ లో లోనే కుళ్ళిపోతున్నాడు. కొత్తగా మళ్లీ జరగపోతున్న అన్యాయం చూచి అతని మనస్సు గగ్గోలు పెట్టింది. కట్లుతెగి పారుతున్న నదీ ప్రవాహంలా అతని ఆలోచనలు పరుగిడుతున్నై. కాని, అతడు తమాయించుకొని – "మీరు కుదుర్చుకొనే ముందు నన్ను సంప్రతించి వున్నట్లైతే బావుండేది !" అన్నాడు.

గోవిందబాబు – "ఎందుకు ?" అనడిగాడు కోపంతో మండిపడుతూ.

విజయ ఒక్కక్షణం ఆలోచించి, ఆ తర్వాత - "ఖాయపరుచుకున్న వారిదగ్గర సిగ్గుపడకుండావుండటానికి..." అన్నాడు.

గోవిందబాబు త్రాగుతున్న హుక్కాగొట్టం అవతల పెట్టి అతనివంక తీక్షణంగా చూస్తూ - "అంటే ఏమిటో నాకు బోధపడలేదు." అన్నాడు.

విజయనాధ్ - "నేను వివాహం చేసుకోను" అన్నాడు దృఢంగా.

"ఎందువల్ల?"

"ఇష్టంలేదు."

ఈ జవాబు విని గోవిందనాద్ మండిపడ్డాడు. ఆయన ఈ జవాబు విని కోపంతో గడగడ వణికిపోతూ - "నీవు అంత పెద్దవాడివై పోయినప్పుడు నీవు చెప్పేదేమిటో సరిగానే చెప్పు! హరిమోహనుని కూతుర్ని వదిలిపెట్ట లేదా?" అనడిగాడు.

విజయనాథ్-"జరిగిపోయిన దానిని గురించి అనవసరం. ఆ విషయాన్ని గురించి మనం యిద్దరం మాట్లాడుకోవటం ఐపోయింది." అన్నాడు.

"అయితే వివాహం చేసుకోవాలని ఎందుకులేదు?"- అనడిగాడు గోవిందబాబు.

విజయనాథ్ - "కారణం కనపడుతూనే వుందిగ ఇవాళ చేసుకున్నదానిని రేపే వదిలిపెట్టవలసి వస్తుందేవె

కనుక చేసుకోకుండా వుంటేనే బావుంటుందనిపించింది"
అన్నాడు తొణక్కుండా, బెణక్కుండా.

అతని జవాబు విని గోవిందనాథ్ ఒక్కసారి చలించాడు. కాని, ఆ మరుక్షణంలోనే తన సహజమైన పట్టుదలతో ఆయన ఉగ్రుడై - "అంటె ఇహ నీవు నా మాటప్రకారం నడుచుకోనంటావు. అంతేగా ?" అన్నాడు.

"అని నేను అనటంలేదు. నేను మళ్ళీ పెళ్ళి చేసుకోననే చెబుతున్నాను. అందువల్ల మీరు అనవసరంగా ఈ విషయంలో ఇతరుల ఎదుట బాధ పడొద్దు." - అన్నాడు విజయనాథ్.

"నన్ను అంత బలహీనుడుగా మాత్రం భావించకు ! నీవు నాకు ఒంటరివాడివని నీవు చేసే పనుల్ని సమర్థించలేను. నీవు చెప్పేదానికి అంగీకరించలేను." - అన్నాడు గోవిందబాబు నిప్పులు కురిపిస్తూ.

అమలను వదలిపెట్టమని చెపుతూ తండ్రి కొడుకుని యీ విధంగానే ఓసారి గదమాయించాడు. మళ్లీ అదేధోరణి కనపరచేటప్పటికి విజయనాథుని మనస్సు తిరుగుబాటు చేసింది. అతడు ఏ మాత్రం స్థాయి తగ్గించకుండానే - "నన్ను కూడ అంత చవటగా భావించకండి ! ఆ స్త్రీకోసమని నేను యీ విధమైన జబర్దస్తీని సహించలేను. నేను మీకు పుట్టిన బిడ్డనేగాని, మీచేత పోషింపబడవలసిన వాడిని మాత్రంకాదు. ఇది మాత్రం మరిచేపోకండి!" అన్నాడు.

గోవిందనాథ్ ఇంత పెద్ద సమస్యకు పరిష్కారమార్గం వెతకలేకపోయాడు. ఆయన మౌనంగానే కూచుండిపోయాడు.

ఆయన జవాబు కెదురు చూడకుండానే విజయనాథ్ - "ఈ విషయంలో మీ నిర్ణయాన్ని నాకు తెలియచేయండి. నేను తెలియచేసిన సంశయం మినహా మరే సంశయమూ లేదు." అంటూ అక్కడనుంచి వెళ్ళిపోయాడు.

మనుష్యుని ఆయువుకుకూడ అంతువుంది. కాని, జ్ఞానోపార్జనకు అంతులేదు. చనిపోయేలోపల అతడు ఎన్నెన్ని అవతారాలెత్తాలో, ఎన్నెన్ని విషయాలు తెలుసుకోవాలో తెలియదు. ఇదే భావం అప్పుడు గోవిందనాథ్ మనస్సులో కదుల్లాడింది.

**కా**లగమనం నిర్విరామంగా సాగిపోతుంది. అది ఓ ప్రవాహం లాంటిది. ఆ ప్రవాహాన్ని ఎవరూ అడ్డలేరు. జీవితాల్లో జరుగుతున్న ఒడిదుడుకుల్నీ, బాధాగాథల్నీ చూచి ఒక్కక్షణం కూడ ఆగిపోదు. కనుకనే దుఃఖంలో కుంగిపోతూన్న హరిమోహన్ జీవితం కూడ ఇతరుల లాగానే గడచి పోతోంది. ఓ జీవితానికీ మరో జీవితానికీ సంబంధం లేక పోవచ్చును. ఒకరు సుఖాన్నే అనుభవిస్తూంటె, మరొకరు దుఃఖాన్నే అనుభవించవచ్చు. ఒకరికి కాలం హాయిగా గడచిపోవచ్చు. మరొకరికి యీడ్చుకుంటూ, ఆవలించు

కుంటూ గడవొచ్చు. కాని, ఒకటి మాత్రం ఖాయం. అందరూ కాలం గడుపుతున్న వారే! గడపకుండా పని జరగదు.

అమల అత్తవారింటి దగ్గరనుండి గెంటివేయబడిన తర్వాత నెమ్మది నెమ్మదిగా మూడు సంవత్సరాలు గడచి పోయాయి. హరిమోహన్, ప్రభావతి కాల ప్రవాహంలో ఆ విషయాన్నే మరిచేపోయారు. దురదృష్ట వంతురాలైన కూతురి విషయంలో వారు మనస్సుని సమాధాన పరుచు కున్నారు. అంతకంటె గత్యంతరం మాత్రం ఏముంది? చేతు ...కు గాజులూ, నుదుట బొట్టూ వుండి కూడ ఆమె విధవగానే ...పోయింది. వారు కూడ ఆ విధంగానే భావిస్తున్నారు.

కాని, అమల మనస్సుమాత్రం అందు కొప్పటంలేదు. ...ు తన చిన్నతనంలోనే అత్తవారింటి కెళ్ళటం, మళ్ళీ ...పబడివేయటం – అంతా జరిగిపోయింది. అప్పుడామె ...నస్సు తల్లిదండ్రులతో కలసి క్షోభించింది. కాని, ఈ మూడు సంవత్సరాలలో ఆమెలో ఎంతోమార్పు వచ్చింది. ఇప్పుడామెలో యౌవ్వనం ప్రవేశించింది. దానిని కాదనగల శక్తి, స్థోమతలూ వుండాద్దూ? ...

ఈ విధంగా రోజులు గడచిపోతున్నై. రోజులు గడచిన కొద్దీ ఆమె హృదయంలో ద్వేషానలం రగుల్కొనసాగింది. మనస్సు తిరుగుబాటు చేయసాగింది. అప్పుడే ఆమె జీవితంలో అకస్మాత్తుగా ప్రమథ్ ప్రవేశించాడు.

# 5

ప్రమథ్ ఓ ధనికుని బిడ్డ. అతని తల్లిదండ్రులు చని పోయారు. అతని ఇల్లూ, వాకిలీ, పొలమూ, పుట్రా హ్యాక్లి జిల్లాలో ఏదో కుగ్రామంలో వున్నై. ఓ ప్రక్క ఉచ్ఛృంఖల జీవితం, మరో ప్రక్క కావలసినంత డబ్బు - ఈ రెంటిమధ్యా అతడు! అతడు తొక్కని చెడుదారంటూ లేదు. ఈ విష యంలో అతడు బాగా ఆరితేరిన వాడని అందరూ అభిప్రాయ పడుతూ వుంటారు. అతడికి స్త్రీ మన స్తత్వం బాగా తెలుసు. వారి నేవిధంగా ఆకర్షించాలో, అతనికి తెలుసు. దాకితప్పి, భయపడుతూ అటూ ఇటూ తిరుగుతున్న లేడీని పట్టుకోవ టానికి ఎప్పుడు ఎలాంటి సంగీతం వినిపించాలో, ఏ దారిలో పోనీయాలో, ఏదారిని పోనీయకూడదో,ఎక్కడ మట్టుపెట్టాలో ఆ వేటగాడికి బాగా తెలుసు. అతడు కావలసినంత జాగ్రత్తగా అడుగు తీసి అడుగు వేయగలడు. అవసరమైతే నిర్లక్ష్యంగా ప్రవర్తించగలడు. ఎవరికీ తననుగురించి అనుమానంకూడ కలగ కుండా తన మనస్సుని దాయాలన్నా గుట్టుగానే, దాయ గలడు. అదే విధంగా జంకూ కొంకూ లేకుండా అవసరమైతే విడమర్చి చెప్పగలడు.

అమలకూ, అతనికీ మంచి చుట్టరికం వున్నప్పటికీ అది లేనిదానితో సమానమే! చాల దూరంకూడ ఆ చుట్టరికం. కాని, దూరాన్ని దగ్గరగా చేసుకోగలవారికి దూరం దూరంగా వుండదు. అందువల్లనే, అమలను చూడటంతోటే, ఆమె చాటుకి పోబోతూంటే ఆ అవకాశం లేకుండా చేయటానికీ-

"ఏం అమలా ! నీ ప్రమథ్ దాని మరిచేపోయావా?" అనడిగాడు. అమల ఆ మాట వింటంతోటే అడుగు తీసి అడుగు వేయలేక పోయింది. అంత చనువుగా, స్నేహంగా పిలుస్తున్న వారికి చాటుకు పోవడమంటే కొంచెం కష్టంగానే వుంటుంది. కష్టమే కాదు, అసంభవంకూడాను. కాని, అమల అతని కెట్టిజవాబూ యివ్వలేకపోయింది. ఆమె మొహం ఒక్కసారి సిగ్గుతో ఎర్రపడి కందగడ్డలా తయారైంది. ఆమె తల్లివంక చూచింది.

ప్రభావతి నవ్వి - "మరిచిపోయి వుండదు. కాని, ఈమధ్య నాలుగైదేళ్ళనుండి మేము నిన్ను చూడలేదుగదూ? తొందరగా గుర్తుపట్టలేకపోయి వుంటుంది. ప్రమథ్ దాకు నమస్కారం పెట్టు, అమలా !" అంది.

అమల తలవంచి అభివందనం చేసింది. ప్రమథ్ ఆమెను ఆశీర్వదిస్తూ - "సదా సుఖించు !" అన్నాడు.

అమల లేచివచ్చి తల్లిదగ్గర నిలబడింది. ప్రమథ్ ఆశీర్వాదం విని ప్రభావతి ఓ వేడి నిట్టూర్పు విడిచింది - "సుఖమెక్కడిది, నాయనా ? అడవి బ్రతుకులై పోతేనూ ?" అంటూ.

గడచిపోయిన గాథలన్నీ ప్రమథ్‌కు తెలుసు. కాని ఏమీ తెలియని అమాయకునిలా - "ఏం జరిగింది ? ఏమిటలా అంటావ్ ?" అనడిగాడు.

ప్రభావతి జరిగిన కథంతా పూసగుచ్చినట్టు చెప్పింది. లేచి వెళ్ళిపోవటానికి కూడ ఓపికలేక, సిగ్గుతో కుంగిపోతూ అమల అక్కడే కూచుండి పోయింది. తన కరుణాగాథ

వింటూంటే తనకే ఏమిటో జాలిగా, భారంగా, రోషంగా వుంది.

చెప్పటం అయిపోయిన కాసేపటివరకు ప్రమథ్ ఏమీ మాట్లాడక పోయేటప్పటికి, ప్రభావతి, అమల అతడు దుఃఖంలో మాట్లాలేక పోతున్నాడని అనుకున్నారు. చివరకు పళ్ళు పటపట నూరుతూ ఇంగ్లీషులో ఏమేమిటో అనుకుం టూంటే వాటి అర్థం స్పష్టంగా తెలియక పోయినా, అతడు విజయనాథ్, గోవిందనాథ్‌లను ఉద్దేశించే పళ్ళు నూరుతున్నా డని మాత్రం అనుకున్నారు.

ప్రభావతి కన్నీరు పెట్టుకుంది. పమిట చెంగులో కన్నీరు తుడుచుకొని – "చూచావుగా బాబు! నా జీవితం ఎలా ఎండిపోయిన మోడులా తయారైందో! దీనికంటె పిల్ల చ..." అని అంది. ఆ తర్వాత మాట్లాడలేక పోయింది. ఇంత దుఃఖంలో కూడ తల్లి కూతురికి అశుభం పల్కలేక పోయింది.

ప్రమథ్ ముఖాన్ని వికృతంగా పెట్టుకొని – "దీనికి మందు ఏమిటో తెలుసా, మామ్మా! కొరడాదెబ్బ!" అని, మళ్ళీ ఓసారి అమల వంక చూచి ఆమె భావ పరంపరను గమ నించి – "కాని, దీంట్లో విజయుని తప్పేమీ లేదు. ఈ విష యం మాత్రం గట్టిగా చెప్పగలను. కన్నతండ్రి సమక్షంలో అతడేం చెప్పగలడు? అయినా, ఇలా ఎలా చేయగలిగాడనే నా సందేహం. అయిందేదో అయిపోయింది. కొద్దికాలంలో అదే చక్కబడుతుంది" అన్నాడు.

"ఓ రోజున నేను కూడ అలాగే ఆశిస్తూ వుండేదాన్ని. కాని, నా కిప్పుడు అలాంటి ఆశ లేదు. విజయ్ నిజంగానే సద్భావంతో వుండి వుండినట్లైతే ఈ మూడేళ్ళలో కనీసం ఓ వుత్తరం కూడ వ్రాసేవాడు కాదా? సరే, పోనీ ఉత్తరం వ్రాయ లేక పోయాడే అనుకుందాం. ఈ మధ్య ఓ రోజున వారికి కనిపించి, వారు మాట్లాడటానికి ప్రయత్నించినా మొహం తప్పించుకొని వెళ్ళిపోయాడట! ఇంకా అతడు మంచివాడని, సద్భావంతో ఉన్నాడని ఎలా అనుకోవటం?" – అంది ప్రభావతి బాధపడుతూ.

ఇహ అక్కడ కూచోవటంకూడ కష్టమైపోయింది అమలకు. ఏదోవిధంగా ధైర్యం చిక్కబట్టుకొని లజ్జాభయాలను త్యజించి వెళ్ళిపోవటానికి లేచి నిలబడింది. ప్రభావతి అది గమనించి – "ఎక్కడకు వెళుతున్నావమ్మా? ప్రమథ్ దాకి ఫలహారం తీసుకొచ్చి పెట్టు! పాపం! మా నాయన ఎండలో పడి వచ్చాడు!" అంది.

ఫలహారం వద్దు వద్దు అంటూనే ప్రమథ్ దా మళ్ళీ అదే విషయాన్ని తీసుకొస్తూ, అమల వెళ్ళేలోపలే – "ఈ విషయాలన్నీ నీవు ముందు చెప్పివున్నట్లైతే చాల బావుండేది. వ్యవహారం ఇందాక వచ్చివుండేది కాదు. ఇప్పుడైనా పోయిం దేమీ లేదులే! త్వరలోనే వ్యవహారాన్ని ఒకగాటికి లాక్కూరానూ?" అన్నాడు.

ఈ మాటలు విన్న అమల హృదయం ఒక్కమారు పులకరించింది. అప్పుడామెలో ఆశకంటె కుతూహలం జాస్తిగా

వుంది. ఏం జరుగుతుందో, ఎలా జరుగుతుందో తెలుసుకోవా లని ఉబలాటపడింది ఆమె మనస్సు.

కాని, ప్రభావతి మాత్రం ఒక్కసారి ఆనందంలో మునిగి తేలింది. కన్నబిడ్డను గురించి ఆమె ఓ ఘడియ కాల మైనా సుఖాన్ని అనుభవించి ఎరుగదు. కాని, కాల ప్రభావం వల్ల కొంత మనఃక్లేశాన్ని మాత్రం మరిచేపోగలిగింది. ఆమె మనస్సు మాత్రం ఆవేదనతో కుంగిపోతూనే వుంది. అందు వల్లనే కొద్దిపాటి ఆశ్వాసనతోనే ఆమె సంతోషంతో ఉప్పొంగి పోయింది. సంభవాసంభవాల్ని లక్ష్య పెట్టకుండానే ఆమె భారం తగ్గిపోయినట్టే సంతోషించింది. ఆమె–"నీవు నాబిడ్డతో సమానం, నాయనా! నీకంటె ఎక్కువ ఎవరు వున్నారు నాకుమాత్రం? నీవు అలా చేస్తే నీమేలును మరిచేపోను. దాని బ్రతుకు బండలై పోదు. అలా జరగకపోతే, అది చచ్చీబకటే బ్రతికీ ఒకటే!" అంది ఉల్లాసంగానే.

అమల ఫలహారం తెచ్చేలోపల ప్రభావతి మనస్సుని ఆకర్షించుకోవటానికి ఎన్నెన్ని మాటలు చెప్పాలో ప్రమథ్ అన్నీ చెప్పి ఆమెని పూర్తిగా వశపరుచుకున్నాడు. ప్రభావతి ఇప్పటివరకు తాను జరిగినదంతా అతనికెందుకు చెప్పలేదా, అని బాధ పడుతోంది. అందుకు తననుతానే తిట్టుకుంది. చివరికి ఇప్పటికైనా చెప్పగలిగినందుకు ఆ భగవంతుడికి ధన్యవాదా లర్పించింది.

ఇంతలో ఓ ప్లేటులో ఫలహారం ఓ గ్లాసెడు మంచినీళ్లు తీసుకొని అమల వచ్చింది. దగ్గరలో వున్న ఓ స్టూల్ తెచ్చి

అతనిముందు పెట్టి దానిమీద ప్లేటూ, గ్లాసూ పెట్టి తలెత్తి ప్రమథ్ దా వంక చూచింది. అప్పుడు వారిద్దరిచూపులు కలుసుకున్నై.

చుట్టరికం దూరంఅయినా, అతడు ఆమెకు అన్న అవుతాడు. ఇప్పటివరకు సంభాషణలోనూ, ఆచరణలోనూ అదే సంబంధాన్ని కాపాడుతూ వచ్చాడు ప్రమథ్. అతడిప్పడి వరకు తన నడవడిక ద్వారా అమల శ్రేయోభిలాషినని రుజువు చేసుకున్నాడు. ఆమె బాగోగుల్ని చూడవలసిన భారం తన మీదనే వున్నట్టు మాట్లాడాడు. ఐనా, అమల అతడ్ని గురించి మంచిగా భావించలేదు. ఎందువల్లనో తెలియదు. అదే అభిప్రాయం ఒక్కసారి అతని చూపుల్ని చూడగానే బల పడింది. వెంటనే అతడినుండి దృష్టి మరల్చింది.

అమల వంగి స్టూల్ మీద ఫలహారం పళ్ళెం, మంచి నీళ్ళ గ్లాసు పెడుతున్నప్పుడు ప్రభావతి, ప్రమథ్‌ల దృష్టి ఆమె మీదనేవుంది. ప్రభావతి ఇతరుల సుఖ దుఃఖాలలో పాలు పంచుకోగల ప్రమథ్ సున్నితమైన హృదయం గురించి ఆలోచిస్తూవుంటే అతడు అమలను లాలసా దృష్టితో చూస్తున్నాడు.

ఆ రోజున హరిమోహన్ ఆఫీసునుండి వచ్చేవరకు ప్రమథ్‌ను పోనీయలేదు ప్రభావతి. అతడు కూడ ఆఁ ఊఁ అంటూనే అక్కడే వుండిపోయాడు. అతడు కోరుతున్నది కూడ అదే!

ప్రమథ్ చెప్పిన మాటలన్నీ విని హరిమోహన్ – "ఏమో! నాకు మాత్రం నీవు వారికి నచ్చచెప్పగలవని నమ్మకం కలగటంలా. కాని, నీకూ విజయకీ స్నేహం వుందంటున్నావ్. కాబట్టి ప్రయత్నించి చూడవచ్చు. నీవు అతణ్ని ఒప్పించగలవని కూడ నమ్మకం లేదు. నాకు అతడు కూడ తండ్రిలాంటి వాడిగానే కనపడుతున్నాడు." అన్నాడు.

కళ్ళతో చూడకపోయినా, ఆ దగ్గర్లోనే అమల వుందని ప్రమథ్ ఊహించు కున్నాడు. ఆమెకు కూడ వినపడేటట్లు బిగ్గరగా – "గోవిందబాబుని గురించి మీరేమన్నా నేను చెప్పేదిలేదు. కాని, విజయ నా ప్రాణస్నేహితుడు. అతడు నాకు బాగా తెలును. అతడు కావాలని మాత్రం తండ్రితో సహకరించి వుండడు. అతడు పెద్దవాడై, ఇంటి వ్యవహారాలు తాను స్వయంగా దిద్దుకో గలిగినప్పుడు ఈ తప్పు తప్పక సరిదిద్దుకుంటాడు." అన్నాడు.

ప్రమథ్ మాటవిని హరిమోహన్ తనలో తానే నవ్వు కున్నాడు. పై మాటకి మాత్రం – "మంచిదే! ప్రయత్నం చేసి చూడు. ఒప్పించగలిగావా, ఓ ఆడపిల్ల జీవితాన్ని రక్షించినవాడవవుతావు. ఆ పుణ్యం నీకే వుంటుంది. కాని, నన్ను మాత్రం వదలిపెట్టు. నేను మళ్ళీ యీ జీవితంలో ఆ ఛండాలుని మొహం చూడలేను. ఆయన వచ్చి నా కాళ్లు పట్టుకొని బ్రతిమాలినా నేను ఆయనతో మాట్లాడను" అన్నాడు.

ప్రమథ్ నవ్వుతూ - "ఇందులో మీ సహాయం నాకు అవసరంలేదు. అదీ కాకుండా, నాకు అవకాశం చిక్కుండే అక్కడకూడ యీ విషయం తీసుకురాను. ఒకవేళ ఆలస్య మైతే నేనీ విషయం మరిచేపోయాననిగానీ, నేను సరైన ప్రయత్నం చేయటంలేదనిగానీ మీరనుకోవద్దు." అన్నాడు.

హరిమోహన్ - "అబ్బే! నేనెందుకనుకుంటాను అలా? పని పూర్తవుతుందని లేనప్పుడు త్వరగా అవుతుందని అనుకోవటం అసంభవం. నేనలా ఆదుర్దా పడను. నీకు నచ్చి నట్టు చేయి." అన్నాడు.

ప్రమథ్ - "పనవుతుందని నమ్మకం లేకపోయినా, నన్ను ముందుకు సాగనిస్తున్నారంటే ఆ పని తప్పక పూర్తవు తుందని నాకు ధైర్యంగా వుంది." అన్నాడు నవ్వుతూ.

టీ త్రాగి ప్రమథ్ గది బయటకు వచ్చాడు. ఇంటి పనుల్లో నిమగ్నమై వున్న ప్రభావతిని ఉద్దేశించి-"మామ్మా! ఇహ నేను పోయివస్తా!" అంటూ, దూరాన నిలబడి వున్న అమల నుద్దేశించి-"అమలా! ఆకులుంటె కాస్త ఇవ్వు. చాల దూరం పోవాలి" అన్నాడు.

ప్రభావతి - "త్వరగా వెళ్లి తీసుకురా, అమ్మా! సున్నం, వక్క-అదీ చూచి తీసుకురా!" అని మళ్లీ ప్రమథ్ వైపు తిరిగి-"పొద్దు కూకింది. ఓముద్ద తిని వెళ్ళరాదూ, నాయనా?" అనంది.

ప్రమథ్ నవ్వుతూ - "ఇది నా యిల్లే! అవసరమైతే అడిగి పెట్టించుకోగలను. కాని, ఇవాళ వీలుపడదు. ఇవాళ ఓ అర్జంటు పని వుంది." అన్నాడు.

"సరే, అలాగే! మళ్ళీ ఎప్పుడైనా రా, బాబు!"-అంది ప్రభావతి.

"తప్పక వస్తాను...ఆకులు చుట్టి లేకపోతే, అమలా! రా, నేను వెళ్ళిపోతాను." అన్నాడు ప్రమథ్.

"అబ్బెబ్బె! వద్దు! ఆగు, ఇప్పుడే తీసుకొస్తాను"- అంటూ ప్రభావతి వంటింట్లోకి వెళ్ళింది.

ఆ దగ్గరలో వున్న గదిలో కూచొని అమల తమల పాకులు చుట్టుతోంది. ప్రమథ్ వచ్చి దర్వాజాదగ్గర నిలబడి - "ఇప్పుడాపని చేయాల్సి వచ్చిందా! కాస్త వక్క పెట్టు! చాలు!" అన్నాడు.

ఈ చనువు చూచి అమల తల సిగ్గు భారంతో వంగి పోయింది. ఆమె తల వంచుకొనే - "ఆలస్యం కాదు. కొద్ది సేపు నిలబడండి!" అంది.

ప్రమథ్ విస్మయాన్ని కనపరుస్తూ - " 'నిలబడండి' ఇదేమి మాట అమలా? తన వాళ్ళతో ఎక్కడైనా యిలా మాట్లాడటం జరుగుతుందా? 'ఆగు!' అని ఎందుకనవు?" అన్నాడు.

ఆత్మీయతతో నిండివున్న యీ మాటవిని, అమల మరింత సిగ్గుతో కుంగిపోయింది. ఆ తర్వాత నాలుగు కిళ్లీలు చుట్టి ప్రమథ్‌కి అందించింది.

అమల చేతిలోనుండి కీళ్ళీలను అందుకొని నవ్వుతూ ప్రమథ్ – "సరే, ఇవాళ్టికి క్షమించాను. కాని, మరెప్పుడూ ఆ తెలివితక్కువ చేయకు. అలా చేసావా, నిన్ను నల్గురిలోనూ 'తమరు' అని పిలిచి శిక్షిస్తాను. ఇంకెప్పుడూ ఈ తప్పు చేయవు కదూ ?" అన్నాడు.

వివశురాలై అమల చిరునవ్వు తెచ్చుకొని నెమ్మదిగా - "ఇంకెప్పుడూ అలా చేయను" అంది.

"సంతోషం !" – అంటూ ప్రమథ్ ప్రసన్న వదనంతో బయట కెళ్ళిపోయాడు.

ఆ మర్నాడు ఉదయం ప్రమథ్ తన మిత్రుడు మానిక్‌లాల్ బెనర్జీ యింటికి వెళ్ళాడు.

మానిక్ ఇంటి దగ్గరే వున్నాడు. బయటకువచ్చి ప్రమథ్‌ని చూడగానే నవ్వుతూ–"ఏం ప్రమథ్ బాబు! ఇవాళ తెల్లారేటప్పటికి వచ్చావు?" అనడిగాడు.

ప్రమథ్ నవ్వి - "నిన్ను షావుకారు చేయటానికి" అన్నాడు.

"షావుకార్ని చేయటానికా? ఎవరికి బాబు?" ప్రమథ్ అటూ యిటూ తేరపార చూచి మానిక్‌లాల్ చెవిలో ఏమిటో ఊదాడు.

"ఎలా?" అంటూ విస్తుపోయి గుడ్లు మిటకరిస్తూ ప్రమథ్‌వంక చూచాడు మానిక్‌లాల్.

"అసలు విషయం తెలియకుండా ఏంచెప్పినా ఇప్పుడు నీకు తెలియదులే! ఓ వ్యవహారంలో నీ సలహా కావాలి. ఎక్కడ కూచుందాం?"-అన్నాడు ప్రమథ్.

"ఇక్కడే కూచుందాం. ఇంకా ఎక్కడికో దేనికి? ఇక్కడ కెవరూ రారు లే!"-అన్నాడు మానిక్‌లాల్.

ఓ అరగంటలో కథంతా చెప్పి సలహా తీసుకున్నాడు. ఆ తర్వాత-"ఏమోయి, నీవు ఆ పని చేయగలవు కదూ?" అనడిగాడు ప్రమథ్.

ఆ మాట విని మానిక్‌లాల్ నవ్వి ఊరుకున్నాడు, ఆ ప్రశ్నకు తాను చెప్పవలసిన జవాబు ఏమీ లేనట్టు.

ప్రమథ్ - "అయితే ఇహ ఏం ఆలస్యం లేదు. ఇప్పుడే వెళ్ళిపో. నేను సాయంత్రం మళ్లీ వస్తా. పేరూ, అడ్రసూ - అంతా కాగితం మీద వ్రాసుకో!" అన్నాడు.

ప్రమథ్ వెళ్ళిపోయిన తర్వాత, మానిక్‌లాల్ బయలు దేరి తిన్నగా బహూబజార్‌లో ఓ ఇంటిముందు నిలబడ్డాడు.

అక్కడ ఓ కుర్రాడు కూచొని పాఠాలు చదువు కొంటున్నాడు. మానిక్ - "ఇదే ప్రియనాథ్ బాబు ఇల్లా?" అనడిగాడు ఆ కుర్రాడ్ని.

"అవునండి!"

"వారు ఇంట్లో ఉన్నారా?"

"ఉన్నారు."

"కొంచెం వారిని పిలువు, నాయనా! ఎవరని అడిగితే మానిక్‌లాల్ బెనర్జీ అని చెప్పు!"

ఓ క్షణంలో ప్రియనాథ్ బాబు బయటకు వచ్చాడు.

మానిక్ వారికి నమస్కరించి – "క్షమించండి. మీకు కొంచెం కష్టం కలిగించాను" అన్నాడు.

ప్రియనాథ్ బాబు ఒకసారి అతడ్ని పరికించి, చూచి – "మీ పనేమిటో చెప్పండి!" అనడిగాడు.

"నేను చెప్పేదేదో కొంచెం వివరంగానే చెప్పాలి. ఇలా నిలుచుంటే లాభంలేదు. కూచోండి!" అన్నాడు మానిక్.

ప్రియనాథ్ బాబు కూచూంటూ – "చెప్పండి. కాని, ఒక్క విషయం మాత్రం మీకు ముందే మనవి చేస్తున్నాను. ఇన్స్యూర్ మాత్రం చేయలేను. లేదూ, ఏదైనా వివాహ ప్రస్తావన తెచ్చినా నాతో చెప్పొద్దు. నా కెలాంటి సంబంధమూ లేదు. మీరు యీ రెంటిలో ఏ ఒక్కదాన్ని గురించి వచ్చినా మీరు రావటం దండగ." అన్నాడు.

మానిక్ చిరునవ్వు నవ్వుతూ – "నేను మీ జీవితాన్ని ఇన్స్యూర్ చేయించటానికి రాలేదు. కాని, ఆ రెండో విషయాన్ని గురించి మీరలా అనటం బాగుండలేదు." అన్నాడు.

ప్రియనాథ్ బాబు కొంచెం కష్టంగానే – "అయితే మీరు ... ..." అన్నాడు.

ఆయనను మధ్యలోనే ఆపి అతడు – "అవునండి! నా మీద ఓ ఆడపిల్ల భారంవుంది. కాని, ఆ విషయంలో మీ సహాయం తీసుకోవటానికి రాలేదు. మిమ్మల్నే ఓఆపద నుండి రక్షించటానికి వచ్చాను" అన్నాడు.

ప్రియనాథ్ - "అదెట్లా ?" అనడిగాడు ఆదుర్దాగా.

"శ్యాంబజారులో ఉంటున్న హరిమోహన్ ముఖర్జీని మీరు ఎరిగే వుందురు" - అన్నాడు మానిక్.

"ఎరగకేం ?"

"నాలుగైదేళ్ళ క్రింద మీరు వారికిచ్చిన అప్పు విషయం మీకు గుర్తువుంది కదూ ?"

"గుర్తు లేకేం ?"

"మీరు ఇచ్చినది మూడువేలు, ఇప్పుడు వడ్డీతో సహా నాలుగేలు అయి వుంటుంది. 'ఇప్పుడు మీకు డబ్బుకూడ చాల అవసరం. కాని, వారు డబ్బు యిచ్చే స్థితిలో లేరు. ఇహ కోర్టు కెళ్ళక తప్పదు. ముందు యింటో డబ్బు తీసు కెళ్ళి ఖర్చుపెట్టాలి. నానా గొడవ చేస్తేగాని మీ డబ్బు మీ చేతికి రాదు. అప్పుడు కూడ నమ్మకంగా చెప్పలేం. వారికున్న ఆ యిల్లు ఏదైనా తాకట్టులో వుంటే, ఇహ సరే సరి-చెప్పేందు కేముంటుంది? ..."

ప్రియనాథ్ గాబరాపడుతూ-ఆగండి! బాబు! ఆగండి! చేయి కాలిన తర్వాత ఎందుకు కాల్చుకున్నానా, అని నేనూ బాధపడుతున్నాను. ఇంకా మీ రెందుకు బాధపెడతారు? ఉపాయమేదైనా వుంటే చెప్పండి." అన్నాడు.

మానిక్‌లాల్ గంభీరాకృతి దాల్చి - "ఒకవేళ యిల్లు కూడ తాకట్టులో వుంటే, మీ డబ్బు గంగలో కలిసిపోయి నట్టే! మీరు కేసు నడిపి శిక్షించుదామన్నా, ఆరెన్నెల్లు తిండి

ఖర్చు కూడ మీరే యిచ్చుకోవాలి. ఇదంతా మీరు చేయ గలరా?" అనడిగాడు.

మానిక్‌ని ఇహ మాట్లాడనివ్వక, కొంచెం కోపంతో— "అయితే మీరు చెప్పేదేమిటో అర్థం కావటం లేదు. ఆ నోటు తీసుకొచ్చి మీకు ఇచ్చేయమంటారా?" అనడిగాడు ప్రియనాథ్ బాబు.

మానిక్ నవ్వుతూ, నాలుక కొరుక్కుంటూ – "రామ్! రామ్! అలాంటప్పుడు నేను మీకు చేసిన ఉపకారం ఏమిటి? మీరు చెప్పేదానిలో నిజం లేకపోలేదు. నేను నోటు తీసుకెళ దామనుకుంటున్నాను. కాని, మీ డబ్బు మీ కిచ్చేసి." అన్నాడు.

"ఎట్లా ?" – ప్రియనాథ్ విస్తూపోయాడు.

మానిక్ నెమ్మదిగా, గంభీరంగా – "ఇంకా ఎట్లా గేముంది ? నేను చెబుతున్నానుగా ! అలాగే ! మీరు ఇష్టపడినట్లైతే ఇవాళ మధ్యాహ్నం వచ్చి, నోటు తీసుకు పోతాను." అన్నాడు.

"అంటే, డబ్బిచ్చి కొనుక్కుంటున్నారన్న మాట !" అన్నాడు ప్రియనాథ్ బాబు.

"ఆఁ. అంతేననుకోండి ! ఇదేమిటిరా, వీడు ఇలా డబ్బురాదని భయపడుతూ, తాను లేనిపోని బాధ కొనితెచ్చు కుంటున్నాడేమిరా, అని ఆలోచిస్తున్నారేమో ! దానికి చాల కారణాలున్నై. చెప్పమంటె చెబుతాను." – అన్నాడు మానిక్‌లాల్.

"అదంతా నా కెందుకులేండి ! నాకు కావలసింది నా డబ్బు" — అన్నాడు ప్రియనాథ్ బాబు.

"అవును, అందుకే ఎంత త్వరగా పని పూర్తి చేస్తే అంత మంచిది. ఆ తర్వాత నా మనస్సే మారిపోవచ్చు" - అన్నాడు మానిక్‌లాల్.

"అవుననుకోండి ! మీరు ఎంత త్వరగా పరిష్కరించు కుంటే అంత త్వరగా తేల్చేస్తాను. నాకేం అభ్యంతరం లేదు" - అన్నాడు ప్రియనాథ్ బాబు. నౌకర్రాణ్ని పిలిచి - "త్వరగాపోయి కిళ్ళీ తెచ్చిపెట్టు !" అన్నాడు.

ఆ తర్వాత కొద్ది రోజుల్లోనే న్యాయ సమ్మతంగా హరిమోహన్ ప్రియనాథ్‌కు వ్రాసిన ప్రోనోటు మానిక్‌లాల్ పేర ట్రాన్స్‌ఫర్ చేయబడింది.

పొద్దుకూకింది. కాని, హరిమోహనముఖర్జీ ఇంట్లో దీపం వెలిగినట్టులేదు. దట్టమౌతున్న ఆ మసక మసక చీకట్లో ముందు వరండాలో కూచున్న ప్రభావతి తన దౌర్భాగ్యాన్ని గురించి ఆలోచిస్తోంది. లోపల గదిలో మంచంమీద కొయ్యబారినబొమ్మలా పడివుంది అమల. ఇవాళ కొత్త షావుకారు మానిక్‌లాల్ యింటి మీదకొచ్చి, నానా గల్లంతు చేసి.

పోయాడు. ఆ మర్నాటికి వడ్డీతో సహా కట్టేయకపోతే ప్లైంట్ చేస్తానన్నాడు. ఇల్లు వేలాం వేయించుతా నన్నాడు.

అమల ఆవేదనకు ఇదొక్కటే కారణం కాదు. కేవలం అందుకోసమై ఆమె అంత బాధపడుతోందని అనుకోవటానికి వీల్లేదు. మానిక్‌లాల్ అన్నమాటలు విని, హరిమోహన్ తనను ఉద్దేశించి అన్నమాటలు ఆమె గుండెల్లో బాకుల్లా గుచ్చుకొన్నై. నిజానికి తాను పడే బాధకంటె ఇతరులను తాను పెట్టే బాధ ఎక్కువగా కనిపించింది. ముందు ముందు తానింక బాధపెట్టవలసి వచ్చేట్టు కూడ కనిపించింది. చివరికి, తన ఒక్కగాను ఒక్క తమ్మునికి యిల్లు కూడ లేకుండ చేసేట్టు వుంది.

అయిందేదో అయిపోయింది. ఇంక దానిని గురించి ఆలోచించటం అనవసరం. కాని, భవిష్యత్తేమిటి, ఇదే ఆమె ఆలోచిస్తోంది. ఈ బాధలనుండి, ఈ అవమానాన్నుండి తప్పించుకోవాలంటే మందు ఆమె చేతిలోనే వుంది. కాని, దానివల్ల ఈ కుటుంబానికి కించిత్తైనా లాభం జరగదు. ఆమె కోసం తీసుకున్న ఋణం, అత్తవారింటి దగ్గరనుండి పంపబడిన కళంకం-ఇవి రెండూ ఆమె తండ్రిని, ఆమె తమ్ముణ్ణీ వెంటాడుతూనే ఉంటై. వీటి రెంటినుండి విముక్తి ఎలా సాధించటమూ, అనే ఆలోచిస్తోందామె.

ఆమె ఆలోచనలకు దారి లేదని ఆమెకు తెలును. తాను ఆలోచించినందువల్ల ఒరిగే లాభం లేకపోగా, జరిగే నష్టం ఎక్కువ అని ఆమెకు తెలుసు. అయినా, ఆమె

ఆలోచిస్తూనే ఉంది. ఇహ తాను చనిపోవటమే వాటన్నిటికి పరిష్కార మార్గమనుకొని ఆమె ఒక్కసారి తృప్తిగా ఊపిరి పీల్చుకొంటోంది. ఆపదల్లో మనిషి శత్రువు సహాయం కోరతాడు. అలాగే అప్పుడామె మనస్సులో విజయనాథ్ కనిపించాడు. ఉత్తరం వ్రాసి వారికి తెలియచేస్తే ఎలా వుంటుంది? వారు ఆమె భర్త. కాని, 'భర్త' మాట ఉచ్చరించగానే ఆమె వళ్లు ఒక్కసారి జలదరించింది. ఆమె హృదయం ద్వేషంతోనూ, అసహ్యంతోనూ గగుర్పొడిచింది. విజయనాథ్ అంటె ఆమెలో వ్యతిరేకభావం జనించింది. ఛీ! ఛీ! దీనికంటె షావుకారు కాళ్ళు పట్టుకొని బ్రతిమాలాడటమే బావుంటుంది. అతడు దయ తలచి యింకా కొంత గడువు యివ్వొచ్చు!

అప్పుడు హరిమోహన్ మానిక్‌లాల్‌తో ఇదే విషయాల్ని గురించి మాట్లాడు తున్నాడు. మానిక్‌లాల్ - "ఈ మూడేళ్ళల్లోనూ ఒక్క దమ్మిడీ కూడ చెల్లించ లేని వానికి యిప్పుడు యింకా రెండేళ్ళుగడువు యిచ్చి చూద్దామన్నా ప్రయోజనం ఏముంటుంది?" అనడిగాడు.

స్పష్టంగా చెబుదామని లేకపోయినప్పటికీ చివరికి చెప్పక తప్పిందికాదు హరిమోహన్‌కి - "రెండేళ్ళలో నా ఇన్సూరెన్స్ డబ్బు వస్తుంది" అని.

"ఎంత వస్తుందంటారు?" - అనడిగాడు మానిక్‌లాల్.

"ప్రాఫిట్‌తో కలుపుకొని అయిదువేలదాకా వస్తుంది" అన్నాడు హరిమోహన్.

మానిక్‌లాల్ కొంచెం సేపు ఆలోచించి – "ఇదంతా నాకు తెలియదు బాబు! భీమా విషయాలు గడబిడగా వుంటై. దాంట్లో ఏమి ఎదురౌస్తుందో, ఎవరికి తెలుసు? మీ డబ్బు మీకు అదునుకి వస్తుందని అనుకోవటం ఎట్లా? రూపాయిలు యివ్వాల్సిన వాళ్ళుకూడ సరైన సమయానికి యివ్వలేరు. భీమా కంపెనీ సంగతి సరే సరి! ఒకవేళ అదీ తాకట్టులో వుంటే, నే నేం చేసేది? అయినా ఆ గొడవంతా నా కెందుకులేండి! నా డబ్బు నేను వసూలు చేసుకోగలను." అన్నాడు.

మానిక్‌లాల్ బెదిరింపు విని, హరిమోహన్ ఒక్కసారి కంపించి పోయాడు. కోర్టులూ, కచేరీలూ ఆయన కళ్ళల్లో కదుల్లాడినై. ఓ క్షణంపాటు నిశ్చేష్టుడై చూస్తూ కూచుండి పోయాడు. ఆ తర్వాత ధైర్యం చిక్కబట్టుకొని – "చూడండి! నేను ఆఫీసులో కాషియర్‌గా పని చేస్తున్నాను. మీరు కోర్టు కెళితే నా ఉద్యోగం కూడ పోవచ్చు. ఓ బీదవాడి మీద కనికరం చూపి ఇంకో రెండేళ్ళు అవకాశం యివ్వటం ఓ బీద వాడి నోటి దగ్గర ముద్ద లాగేయటం కంటె మంచిదికాదు బాబూ? ప్రియనాథ్ బాబు మూడేళ్ళు యివ్వగలిగేడే! మీరు కనీసం రెండేళ్ళు ఆగలేరూ?" అనడిగాడు హరిమోహన్.

ఓ క్షణంపాటు మౌనం వహించి. ఆ తర్వాత – "చూడండి! హరిమోహన్ బాబు! దేన్నైనా సహించుకో వచ్చు! కాని, వెటకారం చేయటంమాత్రం ఏమనిషీ సహించ లేడు. ఈ పనంతా నా చాటున ప్రియనాథ్ బాబే చేస్తున్నా

డని మీకు తెలియదు? నేనేం తెలివి తక్కువ దద్దమ్మనా, అనవసరంగా నోటుకొని బాధపడేందుకు? ప్రియనాథ్ బాబు మీ మిత్రుడు, అందువల్ల నా పేర ట్రాన్స్‌ఫర్ చేసి నాటక మాడుతున్నాడు. మీకు నిజంగా కోర్టులంటే భయపడు తూంటే, డబ్బు యిచ్చివేయండి!" అన్నాడు వ్యంగ్య ధోరణిలో.

"మీరు చెప్పేది కూడ బాగానే వుంది. రూపాయలు యివ్వగలిగితే మిమ్మల్ని యింతసేపు ఎందుకు బ్రతిమాల తాను?" - అన్నాడు హరిమోహన్.

ఈ మాట అంటూండగానే ప్రమథ్ అక్కడ కొచ్చి మానిక్‌లాల్‌ని గమనించకుండానే హరిమోహన్ దగ్గరకెళ్ళి నిలబడ్డాడు. ప్రమథ్ ఎదుట యీ యిచ్చి పుచ్చుకోవటాలు విషయం చెప్పటం యిష్టంలేక మంచీ చెడూ అడిగి యింట్లోకి వెళ్ళమన్నాడు హరిమోహన్.

"వెళుతున్నాను" - అంటూ ప్రమథ్ వెళ్ళకుండానే ఆ దగ్గరలో వున్న కుర్చీ మీద చతికిల బడ్డాడు చేతిలో పేపరు చదువుకుంటూ.

మానిక్‌లాల్ మళ్ళీ అదే ప్రస్తావన తీసుకొచ్చాడు- "మీ దగ్గర డబ్బు వున్న సంగతి ఆవాళే బయటకు వస్తుంది. కాని, ఆ డబ్బు ఇప్పుడే యిచ్చేస్తే బావుంటుంది, అల్లరిపడ కుండా!" అంటూ.

మానిక్‌లాల్ మాటకు జవాబివ్వడానికి హరిమోహన్ వెనుకా ముందూ లాడాడు. ఇదైనా గమనించి అతడు

లోపలకు పోతాడేమో ననుకున్నాడు. కాని, ఆ సూచనలు కనబడక పోయేటప్పటికి హరిమోహన్ – "నా మీద నమ్మకం లేనప్పుడు నేనేం చెప్పినా ప్రయోజనం లేదు. ఓ మంచివాడి మంచితనాన్ని సందేహించటానికి కూడ మీరు సంకోచించటం లేదంటే నేనేం చేయాలి?" అన్నాడు.

హరిమోహనుని యీ ఎత్తి పొడుపు విని మానిక్‌లాల్ ఓ క్షణంపాటు ఏమీ మాట్లాడలేకపోయాడు. ఆ తర్వాత నవ్వి – "నా మంచితనం ఏ పని చేయటానికీ సందేహించదు. ఇవాళ మిమ్మల్ని అడగటానికి సందేహించనట్టే, రేపు మీ ఆఫీసు మేనేజరుద్వారా సమ్మను జారీ చేయించటంలో కూడ సందేహించదు. ఆ తర్వాత కూడ అవసరమైన చర్య నల్లా తీసుకోవటానికి సందేహించదు. మీ మాటను కాదన్నా ననేగా, మీ రిన్ని మాటలు అనేది? ఆ నోటులో ఎప్పుడు అడిగితే అప్పుడు యివ్వటానికి సిద్ధమన్న మీరు మాత్రం డబ్బు చెల్లించటానికి సిద్ధంగాలేరు. ఇదేనా మీ మంచితనం? క్షమించండి! ఇలాంటి పెద్దమనుషులంటె నాకు సుతరామూ పడదు. మీరు చెడ్డవాళ్ళని పిలిచేవాళ్ళే నాకు మంచివాళ్ళుగా కనిపిస్తారు." అన్నాడు మానిక్‌లాల్.

ఈ లోపల అమల మంచం మీదనుండి లేచివచ్చి హాలు దర్వాజాకి లోపలగా నిలబడింది. షావుకారుతో ఏదైనా చెప్పటానికి మాత్రంకాదు, కాని, ఎలాంటి ఒడంబడిక జరుగుతుందో చూదామని మాత్రమే వచ్చింది. మానిక్‌లాల్ మాటలు వినేటప్పటికి దుఃఖం చేత, భయం

చేత అవమాన భారంతో కుంగిపోయింది. తన శరీరాన్ని అలాగే గోడకానించి ఆయనకు హరిమోహన్ ఏం సమాధానం యిస్తారో విందామని ఆతురతతో ఎదురు చూస్తోందామె.

అప్పుడు ప్రమథ్ కలుగ చేసుకున్నాడు. పేపరుమీద నుండి దృష్టి మరల్చి అతడు ఒక్కసారి మానిక్‌లాల్ వంక చూచాడు. ఆ తర్వాత దృఢగాత్రంతో – "ఈ వ్యవహారంలో ఓ రెండు మాటలు మాట్లాడుతున్నందుకు మీరు నన్ను క్షమించాలి. ఈయన నాకు దగ్గర బంధువు కాకుండా వుండి నట్లైతే నేను యీ ప్రయత్నం కూడ చేసేవాడిని కాదు." అన్నాడు శాంతంగా.

నాటకమాడుతున్న మానిక్‌లాల్‌కి నవ్వు వచ్చింది. కాని, దానిని దాయటానికి ప్రయత్నిస్తూ బెగ్గరగా నవ్వి – "చెప్పండి! వారితో తిన్నవి ఏలాగూ తిన్నాను, మిగతావి మీతో తిని యింటికి పోతాను" అన్నాడు.

"షావుకార్లై పుట్టిన తర్వాత, మిమ్మల్ని అంతమాట ఎవ్వరూ అనలేరు. కనీసం నేను మాత్రం ఆ సాహసం చేయలేను. కాని, మీరు కూడ మీ మంచిని నిలబెట్టు కోవాలి. అప్పుడే అందరికీ మంచి!" అన్నాడు ప్రమథ్ గంభీరంగా.

మానిక్‌లాల్ ఏదో ఆలోచిస్తున్న వాడిలా కాసేపు మౌనం వహించి, ఆ తర్వాత – "మీ రనేది బాగానే వుంది. కాని, డబ్బు తీసుకున్నవాడు అసభ్యంగా ప్రవర్తిస్తే మేం కూడ అలాగే ప్రవర్తించాల్సి వస్తుంది. ఐనా,

ఈ చర్చలవల్ల ప్రయోజనం శూన్యం. ఏదైనా ప్రయోజన ముంటే చెప్పండి!" అన్నాడు.

"అవును. అందుకేగా చెపుతున్నది. మీకు మీ డబ్బు వసూలు చేసుకోవాలని వుంటే కొంత గడువు యివ్వాలి. ఇవాళ వచ్చి నెత్తిమీద కూచుంటే యివ్వటం కష్టమే! ఏమంటారు బాబాయి!" – అన్నాడు ప్రమథ్.

హరిమోహన్ విహ్వాల చిత్తుడై – "అవును, ఇవ్వలేం!" అన్నాడు.

మానిక్‌లాల్‌ని ఉద్దేశించి ప్రమథ్ అన్నాడు– "ప్లయింట్ చేసినందువల్ల మాకు నష్టం అలా వుంచి, మీకు నష్టమూ కష్టమూ రెండూ వునై."

మానిక్‌లాల్ గాంభీర్యం తెచ్చుకొని – "నిజమే ననుకోండి! ఐనా, చేయక తప్పదు. క్వినైన్ వేసుకుంటే శరీరానికి నష్టముందని తెలిసినా మలేరియా రోగి దానిని వేసుకోక మానడు కదా? అందుకే యీ విషయాలలో నేను చారుచంద్రచౌధరి యమ్. ఏ. యల్. యల్. బి. దగ్గర సలహా కూడ తీసుకున్నాను. నోటు ఆయన కిచ్చేముందు మీతో ఒకసారి చెప్పి చేయటం మంచిదని ఊరుకున్నాను. రేపు పది గంటలకల్లా ఈ వ్యవహారం కోర్టులో వుంటుంది. నే నిప్పుడు ప్లీడరుగారి యింటి దగ్గరనుండే వస్తున్నాను. నే నిప్పుడే వారితో యీ విషయమే చెప్పివచ్చాను. ఇప్పుడు మీరు ఏమీ చెల్లువేయకపోతే మాత్రం ఒప్పుకోను. అదంతా

ఎందుకు లేండి, అయిపోయిందేదో అయిపోయింది. నేను పోయి వస్తాను'' అన్నాడు.

ప్రమథ్ ఓ క్షణం సేపాలోచించి - "ఏవిధంగానైనా మాకు కొంత గడువుకావాలి. మీరు మాకు డబ్బుయిచ్చారు కాబట్టి మీ మాటను కూడ కాదనకూడదు. అందువల్ల..." అంటూ జేబులోనించి మనీషర్స్ తీసి, దాంట్లోనించి ఓ వంద రూపాయిలు చెక్కుతీసి ఆయనకిస్తూ, ఓ సారి హరిమోహన్ వంక చూచాడు.

సంతోషంతో ఓ సారి నోటు తీసుకొని ఎగాదిగా చూచిన తర్వాత - "ఓ వందరూపాయిలేనా ?'' అనడిగాడు మానిక్‌లాల్.

ప్రమథ్ నవ్వుతూ - "అవునండి! మీరు ఏ మాత్రమైనా చెల్లువేస్తే వెళతామన్నారు కదూ? ఇప్పటికంత వరకు చేయగలిగాం. సంతోషించి వెళ్ళిరండి. ఇంకా ఎన్ని రోజుల కొస్తారో చెప్పి మరీ వెళ్ళండి.'' అన్నాడు.

"మీరెందుకు గడువు కోరుతున్నారో, తెలుసుగా ?'' అనడిగాడు మానిక్‌లాల్.

"మీడబ్బు మీకు చెల్లించటానికి కావలసిన ఏర్పాట్లు చేసుకునేందుకని నాకు తెలుసు. మీరు అప్పటివరకు కూడ వేచి వుండలేకపోతే ఏం చేయాలనుకుంటున్నారో, చేసుకోండి!" అన్నాడు ప్రమథ్‌బాబు.

మానిక్‌లాల్ - "మంచిదే! మీరు నాకు డబ్బు యిచ్చినప్పుడు నేను కూడ మీకు గడువు యివ్వాల్సి వుంటుంది.

ఇస్తాను. నేను మళ్ళీ ఓ వారం రోజులలో వస్తాను. అప్పటి వరకూ కావలసిన యేర్పాటు చేసుకోవచ్చు.'' అన్నాడు.

ప్రమథ్ చెప్పిన మీదట మానిక్‌లాల్ ఆ గడువును పదిరోజులవరకు పెంచటానికి అంగీకరించాడు. ఆ తర్వాత నోటుమీద వంద రూపాయలు జమా వేయించుకొని వెళ్ళి పోయాడు అతడు.

అతడు వెళ్ళిపోయిన తర్వాత ఓ క్షణంకూడ అమల అక్కడ నిలబడలేకపోయింది. భయిన లోపలకు దూసుకు పోయింది.

హరిమోహనబాబు ప్రమథ్ రెండు చేతుల్నీ తన చేతుల్లోకి తీసుకొని – "ప్రమథ్‌బాబు! నిన్ను ఏమని ఆశీర్వ దించాలో నాకు తెలియటంలేదు. నీవు ఈనాడు నా గౌర వాన్ని కాదు, యీ కుటుంబ గౌరవాన్ని కాపాడావు.'' అన్నాడు డగ్గుత్తికతో.

"మీరు నన్ను మీలో కలిసిపోయేట్టు ఆశీర్వదించండి. మాటమాటకి నన్నిలా వేరుచేయిటానికి ప్రయత్నించకండి. ఇవాళ నా దగ్గర డబ్బు లేకపోయింది. కాని......ఉంటే ఆ యధవ పని చెప్పేవాడిని. ఏంచేద్దాం? ఇలాంటి పరి స్థితుల్లో మనం లాంగే ఉండవలసి వస్తుంది.'' – అన్నాడు ప్రమథ్ చిరు నగవుతో.

"బాబూ ! నాకు ఓ సందేహంగా వుంది. ఏదో మాట పడలేక జేబులో డబ్బుతీసి వెంటనే యిచ్చేశావ్. అది నీకు

అవసరమేమో !...” - అన్నాడు హరిమోహన్ తటపటా యిస్తూ.

“నాకు అవసరమే. కాని, అంతకంటే ఎక్కువ అవస రానికి వాటిని వినియోగించాను. అందువల్ల నేను ఆనందిస్తు న్నాను.” - అన్నాడు ప్రమథ్ వెంటనే.

“నీకు యీ డబ్బు యిచ్చేటప్పటికి ఆలస్యం అవుతుం దేమో !...” అన్నాడు హరిమోహన్ డగ్గుత్తికతో.

ప్రమథ్ నవ్వి - “మీరు నాకు డబ్బు త్వరగా యివ్వ గలిగివుంటే, ఆయనకే యిచ్చేవారు కదా ? ఇప్పుడా విష యాన్నే మరిచే పోండి. బాబాయిగారూ ! డబ్బు నేను మీ రడిగితే యివ్వలేదు, మళ్ళీ అడిగి తీసుకోటానికి. నేను మీవాడిని. మీ కష్టాల్లో ఆదుకోవాల్సిన బాధ్యత నాకు కూడ వుంటుంది. అలాంటి బాధ్యత నాకు లేదని మీరను కుంటేమాత్రం డబ్బు యిచ్చేహక్కు నాకు లేదనే నేను అను కోవల్సి వస్తుంది” అన్నాడు.

“ఆఁ, ఆఁ. అలా అనుకోను ప్రమథ్. సురేశ్ కీ విష యంలో ఎంత బాధ్యత, హక్కు వున్నవో, నీకు కూడ అంతే వుంటాయ్” - అన్నాడు హరిమోహన్ తత్తరపడుతూ తొందరలో, సురేశ్ ఆయన ఒక్కగాను ఒక్కకొడుకు.

ప్రమథ్ - “అలాంటి పరిస్థితిలో మీరు దీనిని గురించి అంతగా బాధపడకూడదు - కాని, ఇప్పుడున్న సమస్య, ఆయన ఈ వారం రోజుల్లో డబ్బు ఎలా పోగుచేసి యివ్వటమా అనే !” అన్నాడు.

"నేను సాధ్యమైనంతవరకు ప్రోగుచేయటానికి ప్రయత్నిస్తా. ఎక్కడైనా అప్పు దొరుకుతుందేమో, చూద్దాం. ఏమైనా కష్టమే అవుతుంది. ఒక్కసారిగా ఇంత డబ్బు సంపాయించటమంటే కష్టమే! ... కష్టం కాదు, అసంభవం కూడాను." అన్నాడు హరిమోహన్ ఉదాసీనంగా.

ప్రమథ్ ఓ క్షణంపాటు ఆలోచించి – "సరే, ఈ విషయం తర్వాత నెమ్మదిగా ఆలోచిద్దాం. ఇవాళ్టికి చాల టైం అయిపోయింది. వెళ్ళివస్తాను." అంటూ లేచి నిలబడి వెళ్ళిపోవటానికి సిద్ధమయ్యాడు.

"నీవు ఇప్పుడు వెళ్ళటానికి వీల్లేదు. లోపల కెళ్ళి మీ మామ్మను కలుసుకోక పోతే, ఆమెకి చాల కష్టం కలుగుతుంది. నామీద కోపం వస్తుంది" – అన్నాడు హరిమోహన్ వ్యగ్రుడై.

"ఇప్పటికే చాల ప్రొద్దు పోయింది. ఇప్పుడు మామ్మ దగ్గర కెళితే చాల ఆలస్యమైపోతుంది. ఇవాళ్టికి కలుసుకోవటం పడదులేండి. మళ్ళీ రేపో, యెల్లుండో వస్తాను."– అన్నాడు ప్రమథ్.

హరిమోహన్ అతని మాట నాలకించలేదు. ప్రమథ్‌ని వెంటబెట్టుకొని లోపలకు వెళ్ళాడు. ప్రభావతి వంటింటో వుంది.

భర్త పిలుపు విని, ప్రభావతి బయటకు వచ్చింది. హరిమోహన్ – "ఇవాళ్టినించి నీకు ఇద్దరు కొడుకులు, సురేశ్, పమథ్." అన్నాడు ఆమెతో.

అసలు విషయం తెలియక తిక మక పడుతూ – "అవును. ఆ సంగతి నా కిదివరకే తెలుసు. కాని, దానినే మళ్ళీ ఇప్పుడు చెప్పాల్సిన అవసరం ఏమిటి?" అనడిగింది ప్రభావతి.

హరిమోహన్ దానికి జవాబివ్వక పూర్వమే, ప్రమథ్ "ఆ కారణం ఎందుకులే, మామ్మా! నీవు అలా అను కుంటూంటే అంతే చాలు!" అన్నాడు మధ్యలో అందుకొని.

హరిమోహన్ జరిగిన కథంతా పూసగుచ్చినట్టు చెప్పాడు.

ఆయన చెప్పటం అయిపోయిన తర్వాత – "విన్నావుగా మామ్మా! బాబాయిగారూ చిన్నదానిని పెద్దదిగా చూప టంలో మహా గొప్పవారు. నన్నవసరంగా బాధపడేట్టు, సిగ్గుపడేట్టు చేస్తున్నారు." అన్నాడు.

ప్రభావతి దానిని గురించే ఆలోచిస్తోంది. ఆ ఆపద ఎలా తొలగిపోతుందా, అని ఆమె సతమత మౌతోంది. అలాంటిది ఇట్టే తొలగిపోయేటప్పటికి వ్యాకులంగా ఉన్న ఆమె మనస్సు ఒక్కసారి ఆనంద పరవశమై పోయింది. అమల విషయంలో తగు సహాయం చేస్తానని మాటయిచ్చి ప్రమథ్ ఆమె హృదయంలో యిదివరకే స్థానాన్ని సంపాయించుకో గలిగాడు. ఆ సంఘటనతో ఆమెను మరింత ఆకర్షించుకో గలిగాడు. ఆమె – "బాబూ! ప్రమథ్" అనిమాత్రం అన గలిగింది ఆ సంతోషంలో. ఆమె కళ్ళనుండి కన్నీటిబొట్లు టపటప రాలాయి.

ప్రమథ్ మొదట్లో కొంచెం చలించాడు. ఆ తర్వాత ఆమె కంట్లో కన్నీటి బొట్లు చూచి – "అబ్బే! మీరెవరూ లాభంలేదు. నేను సురేశ్ దగ్గరకు పోతున్నాను" – అంటూ అక్కడనించి వెళ్ళిపోయాడు.

అప్పుడు సురేశ్ పై అంతస్తులో ఓ గదిలో కూచొని పాఠం బిగ్గరగా చదువుతున్నాడు.

# 8

అమల తమలపాకులు తీసుకొని కిళ్ళీ చుట్టడానికి కూచుంది. ప్రమథ్ అక్కడకు వచ్చాడు. ఇవాళ ప్రభావతి చెప్పకపూర్వమే ఆమె ఆకులు తీసుకొని ప్రమథ్ దగ్గర కెళ్ళింది. ఇద్దరూ అన్నా చెల్లెలుగా ఉన్నారు. అందువల్ల సిగ్గుకుగానీ, సంకోచానికిగానీ తావు లేకపోయింది.

ప్రమథ్ అప్పుడు ప్రసన్న వదనంతో తేరిపార చూస్తున్న సురేశ్ వంక చూస్తున్నాడు. సురేశ్ ప్రమథ్ బాబు యిచ్చిన లెమన్‌డ్రాప్ నోట్లో పెట్టుకొని, దాన్ని ఆస్వాదిస్తూ కూచున్నాడు. అతన్ని చూస్తూ వుండిపోయాడు ప్రమథ్.

అమల అది చూచి ఓ క్షణంపాటు ఆగి, ఆ తర్వాత– "ప్రమథ్‌దాదా! ఆకులు తీసుకో!" అంది.

ప్రమథ్ వెనక్కు తిరగటంతోటే ఉదయిస్తున్న సంకోచాన్ని దూరం చేసుకోవటానికి – "అందుకనే సురేశ్ బాబు మెదలకుండా వూరుకున్నాడు" అని అంది అతడి వంక తిరిగి.

ప్రమఖ్ నవ్వి - "సురేశ్ తినేదానికంటె తీయని వస్తువు మరొకటి వుంది. నీవు చుట్టిన కిళ్ళీ మాత్రం ఏం తక్కువ తీయగా వుంది. అమలా!" అన్నాడు.

"ఎందువల్ల?" - అనడిగింది అమల ఆదుర్దాగా.

"ఆ లెమన్ డ్రాపుకంటె బాగుందనుకో!" - అన్నాడు నవ్వుతూ ప్రమఖ్.

ఓ పదిహేడేళ్ళ నవయువతితో యిలా మాట్లాడటం మర్యాద నతిక్రమించినట్టే. ఇలాంటి పరిహాసం ఇంతకుముందు జరిగితే ఆమె తప్పక కోపగించుకొని వుండేది. కాని, ఇప్పుడు జరిగిన సంఘటనవల్ల ఆమె ప్రమఖ్‌ని సంతోష పెట్టాలని ఉబలాట పడింది. ఈ పరిహాసాన్ని ఓ గుక్కలో మింగేసి - "మీకు ఆకులు లెమన్ డ్రాపుకంటె తీయగావుంటే, అవి తీయగా వుండక, ఉప్పగా ఉండివుంటాయి." అనంది సున్నితంగా.

"అలా కాదు. అవి తీయగానే వున్నై. కాని, నీవు మాత్రం సున్నానికి బదులుగా పంచదార వేసివుంటావు - అన్నాడు ప్రమఖ్ తలూపుతూ.

అమల నవ్వింది _ "అలాంటి స్థితిలో వక్క కూడ వేయటం మరిచేపోయుంటా" - అంటూ.

ప్రమఖ్ విస్మయాన్ని తెలియచేస్తూ - "లేకపోతే యింత తీయగా వుంటుందా? దీనిని చుట్టిన చేతుల్లో నన్నా ఆ మహాత్మ్యం వుండివుండాలి, లేదా తినేవాళ్ళ నోట్లోనన్నా?" అన్నాడు.

ఇహ ఆ తర్వాత అమల ఏం మాట్లాడలేక పోయింది. ఆమె మొహం చూచి ఇవాళ తాను కొంత హద్దు దాటి పోయినట్టే భావించాడు ప్రమథ్. మొదటి డోసు కొంచెం ఎక్కువగానే పడింది అనుకున్నాడతడు. వెంటనే ఆ వైఖర్నే మార్చేసి - "నీకు తెలిసివుండదు. నేను యీ ఆకులతో పడేబాధ. ఓ రోజున సున్నం ఎక్కువైతే, మరో రోజున మరొహటి. ఓ రోజున నీకు తీసుకొచ్చి యిస్తాను. నీవే చూద్దువుగాని, నే నెంత బాధ పడుతున్నానో !" అన్నాడు అతడు.

ప్రమథ్ చెప్పిన యీ బాధా గాధను విని అమల హృదయం కరిగిపోయింది. ఆమె - "ఆ నౌకరు మినహా మరింకెవరూ లేరా ?" అనడిగింది.

దయా భావంతో నిండివున్న హృదయాన్ని ఏవిధంగా దెబ్బకొట్టి వశం చేసుకోవాలో అతనికి బాగా తెలుసు. అతడు నవ్వుతూ - "లేకేం ? వంటచేసే మనిషి వున్నాడు. కాని, అతనితో యీ బాధకూడ ఎక్కడ పడేది ! రోజూ, ఉప్పో, కారమో యెక్కువ వేసేవాడు, సున్నం యెక్కువ వేయడని ఏముంది ?" అన్నాడు.

"అతడు బాగా వంట చేయడా ?" అనడిగిందామె.

ప్రమథ్ నవ్వుతూ - "నీవు ఒప్పుకున్నట్లయితే ఓ సారి యిక్కడకు తీసుకొచ్చి నీకు చూపుదును. అప్పుడు గానీ, మనిషి ఎలాంటి తిండి తిని బ్రతకగలడో తెలియదు నీకు !" అన్నాడు.

"ఇంకెవరూ లేరా నీతో" - ఆమె వ్యథిత హృదయంతో అడిగింది.

ప్రమథ్ జాలిగా - "ఇంట్లో వుంటేగా అసలు! నాచిన్నతనంలోనే తల్లి చనిపోయింది. ఇహ నాన్నగారంటావా!... చెపుతున్నావిను! షుమారు ఐదేళ్ళ క్రితం నా కాబోయే భార్యను చూడటానికి వెళుతూ వెళుతూ నావ దుర్ఘటనవల్ల చనిపోయారు. ఇహ చివరికి మిగిలింది నే నొక్కడినే! ఇప్పుడైనా నేను మీ యింటికి తరచు ఎందుకు వస్తుంటున్నానో తెలిసి వుంటుంది." అన్నాడు.

అమల జవాబివ్వక ముందే ఫలహారం తీసుకొని ప్రభావతి వచ్చింది. ఆమె ఫలహారం పళ్ళెం టేబిల్ మీద పెట్టి - "ప్రమథ్ దాకి ఓ గ్లాసు మంచినీళ్ళు తెచ్చిపెట్టు అమ్మా!" అని అంది.

ప్రమథ్ ఒక్కసారి ఫలహారాల వంక చూచి విస్మయం ప్రకటిస్తూ - "మామ్మా! ఇవన్నీ తింటానికేనా?" అనడిగాడు.

"ఇవి ఏమంత ఎక్కువ కాదులే, నాయనా? ఇంట్లో తయారు చేసినవి. తిను!" అంది ఆమె.

అమల మంచినీళ్ళు తీసుకురావటానికి వెళ్ళేది ఆగి, - "ఇవాళ ప్రమథ్ దా ఇక్కడే భోంచేస్తారు. కనీసం ఒక్కపూటైనా హాయిగా తినగలుగుతారు." అనంది.

ప్రమథ్ నవ్వి - "దానివల్ల మరీ కష్టంగా వుంటుంది, అమలా! ఇవాళ ఇక్కడ భోంచేసానంటే రేపు అక్కడ తింటమే కష్టమై పోతుంది." అన్నాడు.

"అయితే మాత్రం!" – అంటూ అమల లోనికెళ్ళింది.

"అలాగే చేయి బాబు! ఇప్పుడు నిన్ను మీ బాబాయి పిలిచారు. మాట్లాడుతూ మాట్లాడుతూ ప్రొద్దు గడిపేస్తారు. ఇక్కడే భోంచేసి వెళ్ళు!" అంది ప్రభావతి.

ఆ తర్వాత అమల మంచినీళ్ళు తెచ్చేందుకని లోని కెళ్ళింది. ప్రమథ్ 'తినను, తినను' అంటూనే ఒక్కొక్కటే అన్నీ తినేసాడు – "మామ్మా! బజార్లో ఎంతో మందిని చూచాను. ఇంత బాగా యీ లడ్డూల్ని వండేవారు కనిపించ లేదు. చాలా బాగున్నై." అంటూ, అతనికి ఓ స్త్రీ హృద యాన్ని జయించట మెట్లాగో బాగా తెలుసు, అందుకే యిష్టం లేకపోయినా, లడ్డూలన్నింటినీ తినేసి నవ్వుతూ – "మామ్మా! లడ్డూలు చాలా బాగున్నై. అందుకే నీవేమీ అనుకోకుండా వుంటే, ఇంకో రెండు మూడు పెట్టుదూ!" అన్నాడు.

ప్రభావతి ఆనందపరవశమై – "లేకేం బాబూ! ఇలా అడిగి పెట్టించుకునేవాళ్ళు ఉండాలిగానీ, యింకా బాగా తయారు చేద్దును." అంటూ లోనికెళ్ళి నాలుగైదు లడ్డూలు తెచ్చి అతని ముందు పెట్టింది. తాను పొందిన స్థానాన్ని మళ్ళీ కోల్పోతానేమో నన్న భయంతో ప్రమథ్ వాటిని కూడ మెదలకుండా తినేసాడు – "మామ్మా! ఇలాంటివాటిని వదలిపెడతానా?" అంటూ.

▪

ప్రభావతి వెళ్ళిపోయిన తర్వాత ప్రమథ్ - "సి వే యీ రభస చేసింది!" అన్నాడు అమలతో.

"నేనేం రభస చేసాను?" అడిగింది అమల.

"ఇదే. యిన్ని లడ్డూలు తిన్నా, మళ్ళీ భోంచేయాలి!" అన్నాడు ప్రమథ్.

అమల చిరునవ్వు నవ్వి - "భోంచేస్తే ఏం?" అని అ...

"దీనివల్ల ఏం జరిగింది? ఏమీ జరగలేదు. నా యెడ నీకున్న జాలిని మాత్రం కనబరిచావు. నా తిండీ తిప్పల్ని గురించి వినేప్పటికి నీ హృదయం కరిగింది. కాని, నా బాధా గాథను వినిపిస్తే ఏం చేస్తావో తెలియటం లేదు." - అన్నాడు ప్రమథ్ గంభీరంగా.

ఈ మాటల్లో ఏమంత గూఢార్థం లేక పోయినా, చెప్పే తీరుని బట్టి అవి నిగూఢంగానే కన్పించినై. వాటికి ఏం జవాబివ్వాలో అమలకు తట్టలేదు. కాని, ఆ దడబిడలో సురేశుడ్ని - "సురేశ్! మీ మాష్టారి ఆరోగ్యం బాగుపడ లేదా?" అని అడిగేసింది.

కాని, ఆ మరుక్షణంలోనే తాను అడిగింది అసందర్భ మని తెలుసుకొని సిగ్గుతో తల వంచుకొని - "ఆ నౌకర్లను తీసేసి మంచి వాళ్ళను ఎందుకు పెట్టుకోరూ?" అనడిగింది ప్రమథ్‌ని.

అది విని ప్రమథ్ నవ్వాడు. ఆమె ఆంతరంగిక ఉద్దేశ్యాన్ని అతడు ఇట్టే కనిపెట్టేసాడు. తాను రెండో సారి వేసిన డోసు కొంచెం ఎక్కువయిందని అనుకున్నాడు. కాని, తన మందు చేస్తున్న ప్రభావాన్ని కనిపెట్టి యింకా ముందుకు పోయినా ఫర్వాలేదని తీర్మానించుకొని అన్నాడు –

"అసలు వుండ బాధ నౌకర్ల దొక్కరిదే కాదుగా ! అవతలకి పంపేసి తీర్చుకోటానికి. మొసలి పట్టుకు పీక్కుతింటూంటే రెండు తాబేళ్ళను తీసి అవతల పారేసినంత మాత్రాన ఏం జరుగుతుంది? నీ వేమైనా నన్ను మొసలినుండి రక్షించగలవా ?"

"మీరనే దేమిటో నాకు తెలియటంలా, ప్రమథ్ దా" అంది భయపడుతూ, ఆరిపోయిన గొంతుతో అమల.

ప్రమథ్ ఆమె భయాన్ని కనిపెట్టి నవ్వుతూ –"నౌకర్లని నేను మొసలి అని చెప్పటం లేదు. నా లోటే, నా దుఃఖమే నన్ను మొసలిగా పట్టుకొని పీక్కు తింటోంది." అన్నాడు.

అమల అతనికున్న లోటేమిటో, దుఃఖమేమిటో అడిగి తెలుసుకుందా మనుకుంది. కాని, తాను వినదలుచుకోని సంగతేమైనా వినవలసి వస్తుందేమోనన్న భయంతో ఇహ ఆ తర్వాత అడగలేక పోయింది.

కాని, ఆమె అడగుతుందని లేకనో, తాను అడిగించుకోవాలని లేకనో ఆమె మాటకు ఎదురు చూడకుండానే "అదే బాధనీ, అదే లోటునీ మీ యింటి దగ్గర కొల్పోతున్నాను. లడ్డూలు యింత బావున్నవంటె వాటిలో క్రొత్త

రకం పంచదార వేసికాదు. వాటిలో నాకు లేని ఆప్యాయత, ఆదరణ మిళితమై వున్నై. అందుకే అంత బావున్నై. నీవు యిచ్చే కిళ్లీలుకూడ అంతే! అమీ! వాటిలో నీ హృదయం కనిపిస్తుంది, నీ చిరునవ్వు కనిపిస్తుంది, నీ ప్రేమా, ఆదరణా కనిపిస్తాయి." అన్నాడు.

సంభాషణలో అతడు కనపరిచిన దుస్సాహసాన్ని చూచి అమల కంపించిపోయింది. వాటికి జవాబివ్వటంకూడ కష్టమే! వాటిల్లో మంచితనం వున్నా మనస్సుకి కష్టంగానే వున్నై. పైగా మాటలమధ్యలో అతడు ఆమెను సంభోదించిన 'అమీ' యింతవరకూ తల్లిదండ్రులు మినహా మరెంకెవరూ సంభోదించలేదు. కాని, యీ రెండు రోజుల పరిచయంతోనే యింత సాహసం చేయగల్గుతున్న ప్రమథ్‌నుండి ఏ విధంగా విముక్తి లభిస్తుందా, అనే ఆమె ఆలోచిస్తోంది. అతని మాటల తీరూ, ప్రవర్తన ధోరణీ చూచిన ఆమెకు అతనిఎడ అసహ్యం కలిగింది.

"కాని, సురేశ్‌కిమాత్రం మీ హాస్యంకంటే పంచదారే బావుంటుంది. చూడండి! ఆవన్నీ తినేసాడు!" -అంది సందర్భాన్ని మారుస్తూ.

ఆమె మోహం సిగ్గుతో కందిపోయి ఎర్రపడింది. ఆమె ఆ సందర్భాన్ని యీవిధంగా మార్చేయకలిగినందుకు లోలోనే సంతోషిస్తూ - "ఏరా బాబూ! అన్నీ అయిపోయినాయా?" అనడిగాడు.

"ఎన్ని వున్నాయమ్మా ? 'అన్నీ' అంటున్నావ్ !"- అన్నాడు సురేశ్ మొహమింత చేసుకొని.

అమల నవ్వుతూ-"దానినిండా వున్నైకదా, ఏవీ అవన్నీ ?" అంది.

అక్కమాట విని వాడు వ్యగ్రుడై నీసావంక ఓసారి ఎగాదిగా చూచి - "నీవు తీసివుంటావు." అన్నాడు.

అది విని ప్రమథ్ బెగ్గరగా నవ్వేసాడు. అమల సిగ్గు భారంతో తల వంచుకుంది. ఆమెవంక చూస్తూ - "నీవు భయ పడకు, అమలా ! నేను నీ తరపున సాక్ష్యం చెప్పటానికి వున్నాగా ! అయినా, వాడు నీమీద నేరంమోపేటంతటి పెద్ద దానివి కాలేదు." అన్నాడు.

ఈ మాటకు జవాబివ్వకుండానే సురేశ్‌ని గదురు కుంటూ-"ఎలాంటివాడివిరా, నీవు ? తిన్నసంగతి మరిచేపోయి యితరులమీదకు తోసేస్తున్నావు." అందామె.

ప్రమథ్ ఆమెమాట విని నవ్వుతూనే - "ఇది నీతప్పు, అమలా ! నీవు వాడికి పరాయిదానవా?" అనడిగాడు.

"పరాయిదాన్ని కాకపోయినా, అబద్ధం అబద్ధమే !"- అంది అమలకూడ నవ్వుతూ.

ఈ విధంగా వారి సంభాషణ మళ్ళీ స్థాయి తగ్గి యిధా రూపంలో దిగింది. ఆ తర్వాత మళ్ళీ ఎటువంట గడబిడ జరగలేదు. ఆ రాత్రి భోంచేసి ప్రమథ్ తన మకాం కెళ్ళి పోయాడు,

పది రోజుల తర్వాత మానిక్‌లాల్ వస్తాడు. రెండు రోజులు ఏ ప్రయత్నమూ లేకుండానే గడచిపోయాయి. ఇహ ఆ తర్వాత నాలుగైదురోజులు మిత్రుల, ఆప్తుల, పరిచయస్తుల యిళ్ళ చుట్టూ తిరిగాడు. ఫలితం మాత్రం శూన్యం. చివరికి మిగిలింది ప్రమథ్. కాని, అతడు కూడ యీ మధ్య యిటు తొంగి చూడనైనా లేదు. అతని మకాం దగ్గర యంక్వయిరీ చేసినా ఏం ప్రయోజనం లేక పోయింది. అతని యింటి అడ్రసుకి టెలిగ్రాం యిచ్చాడు. ఇహ దానికి కూడ జవాబు రాక పోయేటప్పటికి పది రోజుల క్రిందటి పరిస్థితి మళ్ళీ యథా రూపంలో మూర్తీభవించింది. ఓ గంటకి యమకింకరునిలా మానిక్‌లాల్ వచ్చి పడతాడు. డబ్బు అతని చేతిలో పెట్టక పోయేటప్పటికి నానా రకాలగా అవమానిస్తాడు, అసహ్యించు కుంటాడు. ఇదంతా వ్యూహించుకునేప్పటికి హరిమోహన్ వళ్ళు జలదరించింది. అతడి పరిస్థితి చూచిన ప్రభావతి, అమలకు భోంచేద్దామనే కలగలేదు.

ప్రమథ్ ఇప్పటివరకు బాగానే సాయపడ్డాడు. కనీసం యీ పదిరోజుల పాటైనా గణ్ణం తప్పించాడు. కాని, ఇవాళ హరిమోహన్‌గానీ, ప్రభావతిగానీ, అతడు చేసిన సాయం గురించి ఆలోచించకుండా, యీ పదిరోజులనించి కనపడకుండా పోయేప్పటికి మోసం చేసినట్టు, ఊహించుకో సాగారు. వారు ఈ విపత్తునుండి ఎలా ముక్తి సంపాయించటమా

అని ఆలోచించటం మానేసి, ప్రమథ్‌ని గురించే ఆలోచించ సాగారు.

ఇతరులమాట ఎలా వున్నా, అమల ఆలోచనలు మాత్రం మరోవిధంగా వున్నై. ఆమె యీ మధ్య అతడిని గురించి అనేకసార్లు ఆలోచించుకోవటం జరిగింది. ఆలోచించి నప్పుడల్లా అతడు రాకుండా వుంటేనే బావుండుననిపించిం దామెకు. చిన్నప్పుడు పరిచయంవున్నా, అది కాలగర్భంలో కలసిపోయింది. కనుకనే ఆమె అతడితో వంటరిగా మాట్లాడ టానికి భయపడేది. అతని మాటలుకూడ అలాగే వున్నై. వాటికర్థం తెలుసుకోవటం చాల కష్టంగా వుండేది. అతని చూపుల్లోని మర్మాని గ్రహించటం కష్టంకాదు, అసంభవంగా వుండేది. అందుకనే అతడు ఇహ రాకుండా వుంటేనే బావుండు నని ఆమె తనలోతానే తరచు అనుకుంటూవుండేది.

కాని, ఇవాళమాత్రం ఆమె మనస్సు బొత్తిగా మారి పోయింది. ప్రమథ్ వారిని ఆపదలో వదలిపెట్టి పోయినందుకు ఆమె చికాకుగా వుంది. చికాకుతోపాటు కోపంకూడ పొడ సూపింది. అదే ప్రొద్దెక్కినకొద్దీ వికృతరూపంలో వల్లంతా పాకిపోయి మనస్సులో గూడు కట్టుకొని వికటాట్టహాసం చేస్తోంది. అప్పుడే సురేశ్‌ని వెంటబెట్టుకొని – "మామ్మ ఎక్కడ ?" అంటూ లోనికి ప్రవేశించాడు ప్రమథ్. ఆమె మారు మాట్లాడకనే దూరంగా వెళ్ళి నిలబడింది.

ప్రమథ్ యీ విషయం గమనించి – " నామీద కోప మొచ్చిందా, అమలా!" అన్నాడు నవ్వుతూ.

ప్రమథ్ అకస్మాత్తుగా అనుకోకుండా రావటం, వస్తూనే యీ విధంగా ప్రశ్నించటం చూచి అమల చకితురాలైంది. మొహం తిప్పుకొని – "నాకు కోపమెందుకు ?" అంది నెమ్మదిగా.

"నీకోపం ఎందుకొస్తుందో, నేనేం చెప్పగలను ? ఆ కారణమేమిటో నీవే చెప్పు." అన్నాడు ప్రమథ్ ఆమెవైపు నవ్వుతూ చూస్తూ.

"ఏం కారణంలేదు" – అంది అమల గట్టిగా ఆ సందర్భాన్ని మార్చేద్దామన్న ఉద్దేశ్యంతో.

కాని, ప్రమథ్ మాత్రం పొడిగిస్తూ – "నిజం చెప్పావు, అమలా ! అందుకే కారణంలేకుండానే జరిగేపనులంటే నాకు సరదా." అన్నాడు నవ్వి.

అతడు అంతదూరం పోతాడని ఆమె అనుకోలేదు. ఆమె మొహం ఒక్కసారి కంది ఎర్రపడింది. అతనికి తగిన సమాధానం చెప్పి నోరు మూయించుదామనుకుంది. కాని, ఏ మాలోచించో సమాధానం యివ్వలేదు. తను చేసిందే తప్పుగా కనిపించిందామెకి. వాస్తవానికి అతన్ని యింతదూరం రానిచ్చి ఆమె తప్పుచేసింది. ఇంకా మాట్లాడుతూవుంటే ఏమేమి మాట్లాడతానోనని భయంతో ఇహ మాట్లాడటమే మానేసి అవతలకి వెళ్ళిపోయింది.

ప్రమథ్ సురేశ్‌ని తీసుకొని హరిమోహన్ గదిలో కెళ్ళాడు. అతడ్ని చూచేప్పటికి ఆయన మొహం సంతో

షంతో చాటంతయింది. అతడు వచ్చాడు; కాబట్టి ఏదో విధంగా ఓ ఒడ్డుకి చేరుస్తాడు. ఇదే ఆయన దిలాసా.

"బాబాయిగారూ! షావుకారు వచ్చే వేళయిందను కుంటా. డబ్బు చూచారుగా!" – అన్నాడు ప్రమథ్ వస్తూనే.

హరిమోహన్ ఉదాసీనంగా – "లేదు నాయనా! యెంత ప్రయత్నించినా లాభం లేక పోయింది. తొక్కని గడపలేదు. అడగని మనిషిలేడు. ఒక్క దమ్మిడీకూడ దొరక లేదు. ఇహ నిన్నే నమ్ముకున్నాను. నీ కోసం ఎంత గాలించా ననుకున్నావ్? చివరికి గాబరాపడి మీ యింటికి కూడ రిప్లై టెలిగ్రాం యిచ్చాను. దానికి రిప్లైకూడ లేదు. వెళ్ళిన మనిషివి ఒక్కసారి కూడ యిటు తొంగిచూడలేదేం?" అన్నాడు.

"నేను కూడ గోళ్ళు గిల్లుకుంటూ కూచోలేదు. బాబాయి! కనపడిన వాడినల్లా అడిగి చూచాను. కాని ఫలితం లేకపోయింది. ఇంతలో ఏదో అర్జంటు పనిమీద బెనారస్ వెళ్ళాల్సి వచ్చింది. కాని, ఈ మాట గుర్తురాగానే మళ్ళీ పని పూర్తికాకముందే బయలుదేరి వచ్చాను. నా దగ్గర డబ్బుంటే యింకా బాధేముంది?... ఇప్పుడెలా అంటారు?" అన్నాడు ప్రమథ్ నివ్వెరపోయినట్లు నటిస్తూ,

"నే నేం చెప్పను, బాబు! యెటుచూచినా దారి కనపడటం లేదు" – అన్నాడు హరిమోహన్ నిరాశతో.

"ఆవాళ మీరు ఇన్స్యూర్ డబ్బేదో వస్తుందని చెప్పారు కదూ? అదెప్పుడు వస్తుంది?"

"ఇప్పుడెక్కడ ? యింకా రెండేళ్ళన్నా ఆగాల్సి వుంటుంది."

ప్రమోద్ కాసేపు ఏమీ మాట్లాడకుండా, మౌనంగా ఏదో ఆలోచిస్తున్నట్టు గంభీరంగా వూరుకొని, ఆ తర్వాత చటుక్కున ఏదో జ్ఞాపకం వచ్చినట్టు – "మీరు ఆ పాలసీ తాకట్టుపెట్టి ఏమైనా డబ్బుతీసుకోవటానికి అవకాశం వుంటుందేమో ఆలోచించారా ?" అనడిగాడు.

"అది నా దగ్గరుందా, నాయనా ! అది కూడ కంపెనీ తాకట్టుక్రిందనే వుంది." – అన్నాడు హరిమోహన్.

అక్కడే దగ్గర దిగాలు మొహం పెట్టుకొని కూచున్న ప్రభావతి నుద్దేశించి – "మామ్మా ! నీ కెందుకు ఈ బాధలు ? మేమున్నాంగా, ఏదో దారి దొరక్క పోతుందా ? నీ వేమీ బాధపడకు" అన్నాడు ప్రమోద్.

ప్రభావతి ఓ నిట్టూర్పు విడిచి – "నాయనా ! నా దగ్గర యీ గాజులు మినహా మరింకే నగలూ లేవు యిద్దామన్నా. కాని, అమ్మాయి దగ్గర ఏవో రెండు మూడు నగలు వున్నై. వాటినే మీరు తీసుకెళ్ళి....." అనంది.

"అమ్మ బాబో ! ఇది ఎక్కడైనాసంభవమేనా ? ఒకాటి ఆడపిల్ల. రేపోమాపో ఎప్పుడైనా అక్కడ నించి కబురు రావచ్చు. అప్పుడు ఏం పెట్టి పంపిస్తావు ?" అన్నాడు విస్మయాన్ని కనపరుస్తూ ప్రమోద్.

ప్రభావతికి కూడ వాస్తవానికి ఆడపిల్ల సొమ్ము తీసుకుందామని లేదు. ప్రమథ్ అభ్యంతరం చెప్పేటప్పటికి ఆమెకి కొంచెం ధైర్యం కలిగింది.

కాని, ఆ దగ్గరలో తలుపు చాటున నిలబడి యిదంతా వింటున్న అమల హృదయం మాత్రం అందు కొప్పలేదు. తండ్రి కష్టకాలంలో ఆదుకోలేకపోయిన ఈ నగలు వుండేం, లేకేం? వెంటనే నగలు తీసి ప్రమథ్ ముందు పెడదామనుకుంది!

ప్రమథ్ మాట విని యింత దుఃఖంలో కూడ హరిమోహన్ నవ్వాడు - "ఆడపిల్ల అంటావు, అది బాగానే వుంది. కాని, అత్తవారింటి దగ్గరనించి పిలుపు రావటం మాత్రం అసంభవం. అంటే దీని అర్థం నగలు అమ్ముకోమని కాదు సుమా! నేను యిలా అనటంలో ఉద్దేశ్యం నీవు అలా అనుకోవటం పొరబాటు అని చెప్పటమే!" అన్నాడాయన.

"లేదండి! బాబాయిగారూ! మీరలా అనుకోవద్దు. ముందు డబ్బుచూచి మానిక్‌లాల్‌ని సర్ది చెప్పి పంపటం అవసరం. అందుకోసమని నేను ఆ ప్రయత్నంలోకి దిగనేలేదు. ఈ వ్యవహారం పరిష్కారమైన తర్వాత దాని అంతు తేల్చుకుంటాను. నాకు మాత్రం నమ్మకంగానే వుంది......" - అన్నాడు ప్రమథ్ ఉత్సాహాన్ని కనబరుస్తూ.

ప్రమథ్ చెప్పతూ ఉండగానే అమల తండ్రి ఎదుట కొచ్చి నిలబడి - "నాన్నగారూ! మీరు ప్రమథ్‌దా మాటలను లక్ష్యపెట్టకండి! నా నగలన్నింటిని అమ్మేసి ఋుందు

ఆ పని పూర్తిచేయండి." అంది. ఆమె ఉత్తేజితురాలై గబ గబా చేతుల గాజులు తీయబోయింది.

ఇంతలో ప్రభావతి – "అదేమిటె, అలా చేస్తున్నావు! ఇవాళ పండుగనాడు అలా చేయకు!" అంటూ పరుగెత్తుకొచ్చింది.

కాని ఫలితం లేక పోయింది. అమల అప్పటికే గాజులు తీసి తండ్రి ముందు పెట్టింది.

హరిమోహన్ కన్నీరు కారుస్తూ – "నారాయణ! నారాయణ!" అనిమాత్రం అనగలిగాడు.

ప్రమథ్ ఓ క్షణంపాటు నివ్వెరపోయి రాతివిగ్రహంలా చూస్తూ వుండిపోయాడు. చివరికి ఎలా అయితే యేం, తనను తాను సంబాళించుకొని – నేను ఏ ఏర్పాటు చేయలేకపోతే అలాగే నేనే వచ్చి అడిగి తీసుకుంటా. కాని యిప్పుడుమాత్రం చేతికి పెట్టుకో!" అంటూ గాజులు తీసి ప్రభావతి కందిస్తూ– "మామ్మా! నీవు తొడుగు!" అన్నాడు.

ప్రభావతి గాజులుతీసుకొని అమల చేతులకుతొడిగింది.

హరిమోహన్ కూతుర్ని దగ్గరకు తీసుకొని వాత్సల్యంతో – "అదేమిటె, అమ్మా! ఇంత మాత్రానికే భయపడిపోతారా? నీ యీ నగలు తీసుకున్నంత మాత్రాన గట్టున పడతామా? ఎప్పుడూ అలా చేయకు" అన్నాడు తల నిమురుతూ.

అమల మెదలకుండా తల వంచుకొని తండ్రి దగ్గర కూచుండి పోయింది.

ఇంతలో బయట ఎవ్వరో - "హరిమోహన్ బాబు యింట్లో వున్నారా ?" అని బిగ్గరగా అరిచారు.

దుర్గను స్మరించి హరిమోహన్ బాబు ప్రమథ్‌తో కలసి బయట కెళ్ళాడు. మానిక్‌లాల్ వినయ విధేయతలతో నమస్కరించి ముందు కాసేపు పిచ్చాపాటీ మాట్లాడి, ఆ తర్వాత డబ్బు ప్రస్తావన తీసుకొచ్చాడు.

ఓ సారి దీనంగా ప్రమథ్ వంక చూచి, ఆకాశం వంక చూస్తూ - "మీ డబ్బుకి ఏర్పాటు చేయలేక పోయాను." అన్నాడు.

ఓ క్షణంపాటు మౌనంగా వుండి, ఆ తర్వాత నెమ్మది నెమ్మదిగా - "అంటే, ఇంతకీ మీరు దేనికి ఏర్పాటుచేసారో చెబితే సంతోషిస్తాను." అన్నాడు వ్యంగ్య ధోరణిలో.

ఏం చెప్పాలో హరిమోహన్‌కి తెలియలేదు. ఆయన మౌనంగా ప్రమథ్ వంక చూస్తూ వుండిపోయాడు.

"మిమ్మల్ని క్షమార్పణ కోరుకోవటానికే యేర్పాటు చేసుకున్నాం. మీరు దయవుంచి యింకా కొద్దిగడువు యివ్వాలి." - అన్నాడు నవ్వుతూ ప్రమథ్.

ప్రమథ్ మాటకు జవాబివ్వకుండానే మానిక్‌లాల్ జేబుకాగితాల్లోనించి రెండు కాగితాలు తీసి హరిమోహన్ కందించి - "ప్లీడరుగారు యీ కాగితాన్ని మీకు అందించ

మన్నారు ఎందుకైనా మంచిదని. ఒకటి మీదగ్గరవుంచుకొని రెండోదానిమీద సంతకంచేసి యివ్వండి." అన్నాడు.

రెండులైన్లు చదవగానే హరిమోహన్‌కి అర్థమైంది అది దేనికి సంబంధించినదో. ఇహ ఆ తర్వాత చదవకుండానే ఆ కాగితం ప్రమథ్ చేతిలో పెట్టాడు ఆయన.

నోటీసు చదివి ప్రమథ్ కొంచెం సేపాలోచించినట్టే ఆలోచించి, చటుక్కున ఎంతో వినయవిధేయతలు కనపరుస్తూ కొద్ది గడువు యివ్వమని బ్రతిమాల మొదలెట్టాడు. తలుపు చాటున నిలబడివున్న అమల, ప్రభావతి సంగతేమోగాని, మానిక్‌లాల్ కూడ నిజంగానే బ్రతిమాలుతున్నట్టు ఊహించు కున్నాడు. కాసేపు 'నాటకం' సంగతే మరిచేపోయి, కొంచెం మెత్తబడ్డాడు. అదీకాకుండా యీ నాటకం ఆడవలసి వచ్చి నందుకు అతడు బాధపడుతున్నాడు కూడా.

అతడి యీ సంకోచాన్ని చూచి, హరిమోహన్, ప్రమథ్ బ్రతిమాలిన ప్రభావమే అనుకున్నాడు. ఆయనకూడ ప్రమథ్‌కి వంతగా బ్రతిమాలాడు. వాస్తవానికి అది నాటకం కాకుండా వుండినట్లయితే మానిక్‌లాల్ తప్పక మెత్తబడి వుండేవాడే! కాని, తాను ఆడవలసిన నాటకంలో యింకా చాలభాగం వుందని అతనికి తెలుసు. కనుకనే వారు చెప్పటం అయిపోయినతర్వాత – "మీరు చెప్పేది నిజమే! కాని, నేను మాత్రం చేయగల్గింది ఏముంది ? నాకు దయ అన్నా, జాలి అన్నా తగనిమంట. ఆ బలహీనతలు నాలోలేవు. మీరు ఏం చెప్పినా ప్రయోజనంలేదు. దయచేసి మీరు దానిమీద

సంతకం పెట్టియివ్వండి. లేదా, నేను వెళ్ళిపోతాను.'' అన్నాడు గంభీరంగా.

"మీరు అంత తొందరపడుతూంటే మేం చెప్పేది మాత్రం ఏముంటుంది? ఐనా నేను చెప్పేది కాస్త వినిపించుకుంటే మీ సొమ్మేం పోతుంది?'' అన్నాడు ప్రమథ్.

"మీరు ఏమైనా చెప్పాలనుకుంటూంటే మా ప్లీడరుగారిని కలుసుకోండి. స్టేషన్‌రోడ్‌లో వుంది వారి బంగళా. మీకంత దూరంకూడ కాదు'' అన్నాడు మానిక్‌లాల్.

ప్రమథ్ ఓ క్షణం మౌనంగావుండి ఆ తర్వాత-"వారిని కలుసుకోవాలంటే ఎప్పుడు వీలుగా వుంటుందో?'' అన్నాడు.

"డిక్రీపొందే యీ లోపల మీ రెప్పుడైనా మాట్లాడుకోవచ్చు.'' అన్నాడు మానిక్‌లాల్ నిర్లక్ష్యంగా.

"లేదండి! ప్లీడరుగారితో మాట్లాడితే ఏ వ్యవహారమూ ముడిపడదు. మీతోనే మాట్లాడితే బావుంటుంది.''-అన్నాడు ప్రమథ్ తలాడిస్తూ.

"సరే, చెప్పండి, మీరేం చెప్పాలనుకుంటున్నారో!" అన్నాడు మానిక్‌లాల్.

"ఇన్స్యూర్ డబ్బు రావటానికి యింకా రెండేళ్ళ టైం వుంది. ఈ లోపల మీకు డబ్బు యివ్వగల్గటం అసంభవం. పోనీ, మీరు యీ రెండేళ్ళవరకు ఆగలేకపోతే, ఓ పని చేయండి. ప్రతిమాసం ఎంతోకొంత జమ వేసుకోండి. ఆతర్వాత అంతా సర్దేస్తాం'' - అన్నాడు ప్రమథ్.

"సరే, పోనీ అలాగే ఒప్పుకుంటాను. ప్రతిమాసం ఎంత యివ్వగలుగుతారు? వందా, రెండు వందలా?" – కొంచెం మెత్తపడ్డాడు మానిక్‌లాల్.

"వందో, రెండు వందలో అదంతా నాకు తెలియదు. అది మీరే తేల్చి చెప్పండి. అంతేగాని ముందు మేం చెప్పటం, ఆ తర్వాత దానిని మీరు కాదంటం ఏం బావుండదు. అందులో మీరు దయా, జాలీ తెలియనివారయ్యె!" అంటూ ప్రమథ్ బిగ్గరగా నవ్వాడు ఒక్కసారి.

మానిక్‌లాల్ – "మీరెన్ని అన్నా ఏం ఫర్వాలేదు. మీరంటే నాకు నమ్మకం. మీరే తేల్చి చెప్పండి. అందుకు నేను అంగీకరిస్తాను" అన్నాడు.

"అలా అంటారు. బాగానేవుంది. ఓ యాభై రూపాయిలు యిస్తాం. మీకిష్టమేగా?" అన్నాడు ప్రమథ్.

"లాభం లేదండి!" – అన్నాడు మానిక్‌లాల్ మూతి విరుస్తూ.

హరిమోహన్ ఒక్కసారి చలించిపోయి – "ప్రమథ్! నీతో ఓ మాట" అన్నాడు.

ప్రమథ్ వారిని మాట్లాడనీయకుండానే – "పోనీ, ఎనభై రూపాయలు తీసుకోండి. అంతే!" అన్నాడు.

హరిమోహన్ గాబరా పడుతూ – "బాబూ! నీవు ఒక్కసారి యింట్లోకిరా!..." అన్నాడు

ఆయన్ని మాట్లాడ నివ్వకుండానే మధ్యలోనే ఆపి - "ముందు ఆ పెద్దమనిషిని అవతలకి పంపనివ్వండి ! ఆ తర్వాత మనం మాట్లాడుకోవచ్చు !" అన్నాడు.

"మీరలా బేరం చేస్తుంటే ఎట్లా బాబు ?" అన్నాడు మానిక్‌లాల్.

"సరే. ఇహ చివరిసారిగా చెబుతున్నా. ఇహ మీరు ఎదురు చెప్పకుండా వప్పుకోండి ! ప్రతి మాసం ఓ వంద రూపాయిలు జమ వేసుకోండి !" - అన్నాడు ప్రమథ్.

"సరే, మీరు యింతగా చెబుతున్నారు. కాబట్టి ఒప్పుకుంటున్నాను. కాని, ఏ నెలైనా పదిహేనో తారీకు లోపల జమ వేయకపోతే, ఆ మర్నాడే క్లైంట్ పడేస్తాను." అన్నాడు మానిక్‌లాల్.

"ఆహా ! మీరలాగే చేసుకోవచ్చు !" అన్నాడు నవ్వుతూ తలాడిస్తూ ప్రమథ్ - ఏం బాబాయి ! ఏమిటో చెప్పాలనుకున్నారు ? లోపలకు వెళదాం పదండి."

లోపల కెళ్ళటం తోటే హరిమోహన్ - "బాబూ ! అదేమిటి - అలా చేసావు ? మొత్తం వచ్చేది నూటయాభై రూపాయిలు. వంద రూపాయిలు పోతే ఇహ మిగిలేదే ముంటుంది ?" అన్నాడు దీన స్వరంతో.

ప్రభావతి, అమలకు కూడ ఈ యేర్పాటు నచ్చలేదు. ప్రభావతి కూడ అదే అభిప్రాయం చెప్పింది - "అసలే ధరలు మండి పోతూంటే, యీ యేర్పాటు చేసావు. ఇహ తినేందు కే ముంటుంది ?" అంటూ,

తీసుకోవాల్సి వచ్చింది. దానికోసమని యిద్దరు నౌకర్లు. మొత్తం ఏదన్నాగానీ ఓ యెనభై రూపాయిలు అనవసరంగా ఖర్చయి పోతున్నై. మనం ఆ యిల్లు వదులుకుంటే యెనభై రూపాయిలు ఇక్కడ ఖర్చు పెట్టుకోవచ్చు. మీరు ఎలాగైనా ఇరవై ముప్ఫై రూపాయిలు యిచ్చుకోవాల్సిందే! అవి, ఇవీ కలిపితే మనకంత కష్టమేమీ ఉండదనుకుంటా. అదీ కాకుండా ఓ ఆర్నెల్లు గడిచిపోతే ఆ బాధకూడ వుండదు. నాకు ఓ చోట డబ్బు రావాల్సి వుంది. అది రాగానే మొత్తంగా సర్దేద్దాం. ఇహ నా సంగతంటారా? ఏ దొహా మెస్‌లో మకాం పెడతాను. అక్కడ వుండటం కష్టమైపోతే, మిత్రులు చాలామంది వున్నారుగా! అదీ వీలుగాకపోతే మీరు ఉండనే ఉన్నారు కదా!" అన్నాడు యెంతో గంభీరంగా తోణ కుక్కుండా, బెణకుక్కుండా.

ఆ మాటలు విని హరిమోహన్, ప్రభావతి ఆనంద పరవశులయ్యారు. వారు యింత తేలికగా ఆ సమస్య పరిష్కార మౌతుందని ఊహించనైనా లేదు.

హరిమోహన్ సంతోషంతో అన్నాడు – "ఇలా జరిగితే చాల బావుంటుంది. కాని, ఒక్కమాట బాబు! నీకేగాని మాకు లేదా ప్రేమ? నీవు వచ్చి యిక్కడే వుండిపో!" అని.

ప్రభావతి కూడ అదేమాట అంది.

ప్రమథ్ నవ్వుతూ – "మీరంతా అంటూంటే నేను కాదంటానా? ఐనా, ఇప్పుడు సమస్య అదికాదు. ముందు

మానిక్‌లాల్‌ని అవతలికి పంపాలి. వంద రూపాయిలు యివ్వ టానికి మీరంతా ఒప్పుకున్నట్లేగా! నీవు ఏమంటావు, అమలా ?'' అన్నాడు.

అమల అతనివంక చూడకుండానే నెమ్మదిగా — ''చెడ్డదేంకాదు'' అని, మళ్ళీ తండ్రిని ఉద్దేశించి — ''నాన్నా! ఓ పని చేయరాదూ? నా నగలు ఎట్టాలేదన్నా ఐదారువందలు చేస్తాయి. పోనీ వాటిని అమ్మేసి కొంత తీర్చేస్తే బావుంటుం దేమో! ఈలోపల ఇన్సూర్ డబ్బుకూడ వచ్చేస్తుంది. ఆ డబ్బు రాగానే ప్రమథ్‌దాదా డబ్బు యిచ్చేయవచ్చు. అలా చేస్తే ఆయనికి కష్టంవుండదు'' అంది నీళ్ళు నములుతూ.

ఇలాంటి యేర్పాటుకంటె ముందు ప్రమథ్ చెప్పిన యేర్పాటే మంచిదని తెలుసుకోవటానికి హరిమోహన్‌కి అట్టే టైం పట్టలా. లేనిపోని మాటలు అని మంచి యేర్పాటును చెడగొడుతుందేమోనని, భయంకొద్దీ ఆయన కూతురుమీద మండిపడుతూ — ''నీవు మాటి మాటికి ఆ నగలుసంగతి తీసు కొచ్చి యీ ఋణం తీర్చవలసిన బాధ్యతంతా నీదే నన్నట్టు చెబుతున్నావు. అంతేగా?'' అన్నాడు.

ఆమాట వినేటప్పటికి అమల హృదయంలో ఒక్క సారి అగ్గి భగ్గుమంది. కాని, తండ్రికి సమాధానం చెప్పగల శక్తి ఆమె దగ్గర లేకపోయింది.

ప్రమథ్ ఆమెను సంతృప్తి పరుద్దామన్న ఉద్దేశ్యంతో— ''అదికాదు బాబాయి! అమల అలా చెప్పటంలా. కాని, నేను మీకు సహాయంచేయటం బాగుండదన్నట్టు చెబుతోంది.

నేను బాధ పడిపోతానేమోనని భయపడుతోంది... అమలా! నిజంగా అలాంటి అభిప్రాయం వుండివున్నట్లైతే ప్రమథ్ దాదా అనక 'ప్రమథ్ బాబు' అని వుండవలసింది." అంటూ పెద్దగా పకపకా నవ్వాడు.

ప్రమథ్ యీ విధంగా చక్కగా సందర్భాన్ని మార్చేసినందుకు అమల ఎంతో సంతోషించింది. ఆమె హృదయంలో అతనియెడ గౌరవము, తండ్రియెడ కోపమూ జనించాయి. ఆమె నెమ్మదిగా - "మీరు నా మాటలకి మీ యిష్టమొచ్చినట్లు అర్థాలు చెప్పుకుంటూంటే నేను మెదలకుండా వూరుకోవడమే మంచిది. మీకు మంచిదని తోచినట్లు మీరు చేసుకోండి!" అంటూ అక్కడనించి వెళ్ళిపోయింది.

ప్రమథ్ నవ్వి - "నీవు నిజంగా అలా అనుకోకపోతే పోనీయి, ఆ సంగతి. నా మాటను నేను ఉపసంహరించుకుంటున్నాను. సరే, అసలు విషయం మరిచేపోయాం. ముందు మానిక్‌లాల్‌ని అవతలకి పంపేయాలి.'' అన్నాడు.

ప్రతిమాసం ఓ వందరూపాయిల చొప్పున యిస్తామని హరిమోహన్, ప్రమథ్‌లు మాట యిచ్చిన తర్వాత మానిక్‌లాల్ అందుకంగీకరించి వెళ్ళిపోయాడు.

ఓ మాసం రోజులు గడచి పోయాయి. ఈ మాసం రోజులలోనూ ఒక్కసారి కూడ ప్రమథ్ హరిమోహన్ యింటికి

వెళ్ళలేదు. కాని, ఒహాటీ రెండు రోజులముందే అతడు పంపిన డబ్బై ఐదు రూపాయిల మనీఆర్డరు హరిమోహన్ కందింది. హరిమోహన్ రెండు మూడు సార్లు అతడ్ని వెతుక్కుంటూ అతని మకాం దగ్గర కెళ్ళాడు. అతడు యిక్కడనే వుంటున్నట్టు ఒకళ్ళిద్దరూ చెప్పగా విన్నాడు. కాని, కలుసుకోలేక పోతున్నాడు.

అమల భయం నిర్హేతుకమైంది. ఆ మర్నాడే వచ్చి ఇక్కడే తిష్ఠ వేస్తాడనుకొని, తనను అతన్నుండి ఎలా రక్షించు కోవటమా, అని ఆలోచించిన అమలకు, ఆమె అనుకున్నట్టు రాకపోయేటప్పటికి కొంచెం ఆశ్చర్యంతో పాటు బాధ కూడ కలిగింది. వాస్తవానికి తాను అంత తేలిక అభిప్రాయానికి రావాల్సింది కాదు! కాని, ఆమెకేం తెలుసు? ఇదంతా ప్రమథ్ ఆడే నాటకంలో ఓ భాగమేనని! ప్రమథ్ ఆ రోజునే 'మనం వెంటనే వచ్చి బిసాణా వేస్తే పిట్టను పట్టుకోవటం కష్ట మౌతుంది' అనుకొన్నాడు. ఎప్పుడు ఎలాంటి వాతావరణాన్ని సృష్టించాలో ఆ వేటగాడికి బాగా తెలుసు.

ఆ తర్వాత ఓ వారం పదిరోజులు గడచిపోయాయి. ఇహ కొద్ది రోజుల్లో మానిక్‌లాల్ డబ్బుకోసం వస్తాడు. ఆ డబ్బు కోసం హరిమోహన్ చికాకు పడుతున్నాడు. అప్పుడే డబ్బు బదులుగా ప్రమథ్ దగ్గరనుండి ఓ ఉత్తరం వచ్చింది. ఆ ఉత్తరం క్రొత్త చోటునుండి వ్రాసాడు. అందులో వచ్చి డబ్బు తీసుకెళ్ళ వలసిందిగా వ్రాసాడు.

ఆనాడు ఆఫీసునుండి వస్తూవస్తూ హరిమోహన్ ప్రమథ్ క్రొత్తబస కెళ్ళాడు. తాలతల్లాలో ఓ పాతమేడ. ఈ దశాబ్దంలోనే కాదు, గత దశాబ్దంలోకూడ దానికి సరైన మరమ్మతు జరిగివుండదు. ఈ విషయం ఒక్కసారి దానివంక చూడగానే తెలియవస్తుంది. బయట అరుగులమీద ఓ మనిషి కూచునివున్నాడు, నల్లగా బొద్దుగా వున్నాడు.

"ఏమబ్బాయి ! ఇది మేస్సేనా?" – అనడిగాడు హరి మోహన్ అతన్ని.

"మేస్సంటారా, ఏటిబాబు? హోటేలు, అగపడటం లేదూ ఆ బోర్డు – "ది గ్రేయిటే బెంగాల్ హోటేల్" అన్నాడు అతడు విస్తుపోయి.

హరిమోహన్ ఓ సారి ఆబోర్డువంక చూచి – "బాబూ మీ రీ యింటోనే వుంటున్నారా?" అనడిగాడు.

"ఉండటేమిటండీ ! కొంపతీసి మీకు తెలియదేమో ! దీని ప్రొపెటర్ని నేనేనండి ! నాకు భాగస్తుడుకూడ ఎవడూ లేడు" – అన్నాడు అతడు.

"సరే, అలాయితే మంచిదేగా ! నాకు కావలసింది కూడ మీరే ! ఇక్కడ ప్రమథ్ చటర్జీ వుంటున్నాడు కదూ?" అనడిగాడు హరిమోహన్.

"ఉన్నారు. కాని మీ రెవరో చెప్పారుకాదు ?" అనడి గాడు హోటల్ ప్రొప్రయిటర్.

"నేను అతనికి బాబాయినవుతాను లేండి! అతడ్ని ఓ సారి కలుసుకోవాలని వచ్చాను." అన్నాడు ఆయన.

"ఓహో, అలాగా ! నమస్కారమండి. రండి ! లోపలకి రండి !" అంటూ హోటలు ప్రొప్రయిటర్ లోనికి దారి తీశాడు – "ఈ మధ్య ఆయనకు సుస్తీగా వుంటోందండి!"

'సుస్తీ' అని వినేప్పటికి ఆయన కొంచెం గాబరా పడ్డాడు. ఆ చీకటిగదిలో ముందు ఆయనకు ఏమీ కనపడలేదు. కాని–

"రండి, బాబాయిగారు! ఇలా కూచోండి" అన్నమాట విని ఓ మూలమంచం వుందన్న సంగతి గమనించి వెళ్ళి ఆ మంచంమీద చతికిలబడ్డాడు–

"ఏమిటి సుస్తీ. నాయనా?" అంటూ.

"చెపుతా!"అని, ఆ రెండోవ్యక్తి నుద్దేశించి"చక్రవర్తీ! దీపం వెలిగించు. కొంచెం ఆ తలుపు తీసి అట్టిపెట్టు."అన్నాడు

చక్రవర్తి వెంటనే దీపం వెలిగించి, తలుపు కొంచెం తీసాడు. ప్రమథ్ షావుకారై వుండటంవల్ల అతనికి హోటల్లో బాగానే జరుగుతోందని వూహించుకున్నాడు హరిమోహన్.

చక్రవర్తి వెళ్ళిపోయినతర్వాత – "ఏం పెద్దసుస్తీకాదు. బాబాయి ! ఏదో నాలుగైదు రోజులనుండి కొంచెం జ్వరం తగులుతోంది. నిన్నటినించి కొంచెం తేలికగా వుంది. కాని బలహీనం మాత్రం తగ్గలేదు. చాలా నీరసంగా వుంటోంది. లేకపోతే, నేనే వచ్చి డబ్బుయిచ్చి వుండేవాడిని. మీకు చాల కష్టం కలిగించాను." అన్నాడు ప్రమథ్.

ఓ క్షణంపాటు మౌనం వహించి హరిమోహనబాబు– "నీవు యిలా చేయటంవల్ల నాకు చాల కష్టం కలిగినమాట

వాస్తవమే. నీవు యింటి కెందుకురాలేదు ? ఇదేనా నీ మంచి తనం ? నేనిప్పుడే బండి తీసుకొస్తా. పదా, వెళదాం. ఇహ యిప్పుడు నీవు రాకపోతే నీది దమ్మిడీకూడ ముట్టను. తెలిసిందా?" అన్నాడు.

ఆది విని ప్రమథ్ చాల సంతోషించాడు లోలోనే. కాని, ముసుగుబాగా పైకి తీసుకోని అక్కడకు రావటంకంటే యిక్కడే వుంటం తనకు బావుంటుందని చెపుతూ ఏవో కొన్ని కుంటె సాకులు చెప్పాడు. కాని అవి కుంటెసాకులన్న సంగతి హరిమోహన్‌కి కనపడుతూనే వున్నది. చివరికెలా అయితే యేం, తను రాకపోవటానికి కారణం ఆనాడు అమల ప్రవర్తించిన తీరేనని మాత్రం హరిమోహన్ అనుకునేట్టు మాత్రం చెయ్యగలిగాడు.

కాని, అతడు మాత్రం యెన్ని చెప్పినా వినకుండా, ఎంత బ్రతిమాలినా రానని మంకుపట్టు పట్టి కూచోనేటప్పటికి హరిమోహన్‌కి కోపం వచ్చి, ప్రమథ్ యెంత చెప్పినా ఆలకించకుండా డబ్బు తీసుకోకుండానే వెళ్ళిపోయాడు.

మాట పట్టుదల వచ్చి అభిమానం కొద్దీ డబ్బు తీసుకో కుండా వచ్చేడే నన్నమాటగానీ, బయలుదేరిన దగ్గరనించి భయంగానే వుంది. మానిక్‌లాల్‌కి ఏం సమాధానం చెప్పి పంపాలి ? ప్రభావతి ఆయన యింటికి రావటంతోటే - "ప్రమథ్ ఎందుకు రాలేదండీ ?" అనడిగింది. అప్పుడు అమల కూడ ఆ దగ్గరలోనే నిలబడి జవాబు వినేందుకు నిలబడింది. ఆమెను చూడగానే ఆయనకు తేళ్ళూ జెర్రూ పాకినట్టయింది.

"ఈ సారి షావుకారు వచ్చినపుడు దాన్నే సర్దిచెప్పి పంపమను. మనం ఎందుకు ?" అన్నాడు అమల నుద్దేశించి.

"ఏంటి, అలా అంటారు ? అదేం చేసింది ?" – అనడిగింది భయపడుతూ ప్రభావతి.

హరిమోహన్ అదేస్థాయిలో కోపంతో వణకిపోతూ – "ఎందుకు : అప్పుడే నీవుకూడ మరిచేపోయావా ? ఆ రోజునే నీ కూతురు ప్రమథ్ రావటానికి ఏదో అభ్యంతరం చెప్ప బోయినప్పుడే నేననుకున్నా, అతనికేమాత్రం ఆత్మాభిమానం వున్నా యిహ మన యింట్లో అడుగుపెట్టడని. అలాగే జరిగింది. పైగా మనకు నెలకు డెభైఅయిదు రూపాయిలు పంపిస్తూ తానెంతో బాధపడుతున్నాడు." అన్నాడు.

"అలా అని అతడేమన్నా మీ దగ్గర అన్నాడా ?" – అనడిగింది ప్రభావతి.

"అతడంత బహిరంగంగా చెప్పే తెలివితక్కువ వాడు కాదు" – అన్నాడు హరిమోహన్.

"డబ్బు తీసు కొచ్చారా !"

"నేనంతగా చెడిపోలేదు. నాకూ అభిమానం వుంది. ఇలాంటి పరిస్థితుల్లో అతన్నడిగి డబ్బు ఎలా తీసుకొనేది ?"

అమల ఓ క్షణంపాటు మెదలకుండా నిలబడి వింది. కాని, ఇహ ఆ తర్వాత నిలబడి వుండలేక పోయింది. కాళ్ళీడ్చు కుంటూ పోయి మంచం మీద పడింది. ఆవేదనవల్లగానీ, దుఃఖం వల్లగానీ ఆమె బాధ పడటంలేదు. కాని ఆత్మాభి మానంచేత కుంగి పోతోంది. ఇంతకంటే తనకు అవమానం

ఏముంటుంది ? షావుకార్ని తాను సమాధానం చెప్పి పంపాలా ? కన్నతండ్రి యింత అవమానిస్తాడా ?...

ఇక్కడకొచ్చి ప్రమథ్ వుండటంలో అతనికేం లాభం లేకపోతే నాకు మాత్రం కష్టం ఏమిటి ? పోనీ, అలాగే జరుగుతుంది. కాని ఏదైనా రోజున అతడ్ని గెంటేయవలసి వస్తే తాను అప్పుడు కూడ దూరంగానే వుంటుంది !

అమల లేచి దీపమెలిగించింది. మూడు ముక్కల్లో ఓ ఉత్తరం వ్రాసి, ముందుహాలులో డ్రాయరుమీద పడివున్న ప్రమథ్ వ్రాసిన ఉత్తరం తీసి అతని అడ్రసు చూచి కవరు మీద వ్రాసి, దానిని పోష్టులో వేయించితిని.

ఆ మర్నాడు ఉదయం లేచీలేవటంతోటే ప్రమథ్ మధ్యాహ్నం హరిమోహన్ యింట్లో లేనప్పుడు వెళ్ళి ప్రభావతికి డబ్బు యిచ్చి రావాలనుకున్నాడు. అప్పుడు తల్లి కూతుళ్ళ వైఖరి చూచి అక్కడ కెళ్ళటమో, వెళ్ళక పోవటమో నిర్ణయించుకుందామనుకున్నాడు. కనీసం ప్రభావతి ఐనా అక్కడ వుండమని గట్టిపట్టు పడుతుందని అతని నమ్మకం. ఏ మాత్రం గట్టిగా చెప్పినా యీ సారి అతడు లేదని చెప్ప దలుచుకోలేదు.

తినీ త్రేపి, హరిమోహన్ యింటి కెళదామని అనుకుంటూండగానే పోష్టుమేన్ వచ్చి ఉత్తరం యిచ్చిపోయాడు.

కవరుమీద యిదువరకెన్నడూ చూడని దస్తూరి ఉండటం వలన ఎవరు వ్రాసారో తెలియక త్వరత్వరగా తెరిచాడు. అమల వ్రాసింది. ప్రమథ్ మంచి హుషారుగా ఉత్తరం చదువు తున్నాడు.

"ఏలినవారి పాద సన్నిధికి—

ఈ మాసం రోజుల్లోనూ మీరు వక్కసారైనా యిటు తొంగి చూడలేదు. అనారోగ్యంగా వుంటూకూడ మా యిల్లు మీకు గుర్తుకు రాకపోవడం మా దురదృష్టం. నేను ఏదైనా తప్పుచేసి వున్నట్లయితే క్షమించండి. మీరు వెంటనే సామాను అదీ సర్దుకొని మా యింటికి వచ్చేయాలని నేను ప్రార్థిస్తున్నాను. మీరు రానిచో నాకు ఆశాభంగం కలుగుతుంది.

ఈ ఉత్తరం మరెవ్వరికీ చూపకండి. తీసుకొచ్చి నాకిచ్చే యండి.

నా నమస్కారాలను అందుకోండి.

ఇట్లు,
—అమల."

ఉత్తరం చదువుకొని ప్రమథ్ ఎంతో సంతోషించాడు. ఓ క్షణంపాటు ఆలోచించి, హోటలునౌకర్ని పిలిచి బండితీసుకు రమ్మనిచెప్పాడు. ఆ తర్వాత లెటర్ పాడ్ తీసి ఉత్తరం వ్రాసాడు.

"ప్రియమైన అమలా!

నీ ఉత్తరం చదువుకొని చాల సంతోషించాను. నేను తీసు కొంటున్న మందుకంటే నీ ఉత్తరం బాగాపనిచేసింది. ఓ అయిదు నిమషాలు ముందు తలెత్తి చూడటం కష్టంగా వుండేది. కాని, యిప్పుడు లేచి కూచోని నీకు యీ వుత్తరం వ్రాస్తున్నాను.

నీవు నన్ను వెంటనే రమ్మని అజ్ఞాపించావు, శరీరంలో ఏ మాత్రం ఓపికవున్నా నీముందు వచ్చి నిలబడేవాడిని. ఏమైనా నీవు నన్ను ఆహ్వానించావు. ఇహ నన్నాపగల శక్తి దేనికీలేదు. రేపే వచ్చేస్తున్నాను.

ఇహ రెండో సంగతి దానినికూడ నేను తప్పక శిరసావ హిస్తాను. కాని ఒక్క విషయంలో మాత్రమే, ఎవ్వరికీ చూపను. నన్ను విశ్వసించు. కాని, దానినిమాత్రం నీకు తిరిగి యివ్వను. ఆలోచిస్తే నీకు కారణం తెలుస్తుంది. నేను వేరే చెప్పాల్సిన అవసరం లేదనుకుంటా.

నిన్ను రేపే కలుసుకోవటం జరుగుతుంది. కాబట్టి యిహ వ్రాయటం మానేస్తా. నా ఆశీర్మాదాన్ని అందుకో.

—నీ ప్రమథ్‌దా."

ఓ కవరులో పెట్టి, అమల అడ్రసువ్రాసి ఆ ఉత్తరాన్ని భద్రంగా జేబులో పెట్టుకున్నాడు. ఆ బండి వచ్చిన తర్వాత పెట్టీ బేడా సర్దుకొని తిన్నగా హరిమోహన్ యింటికెళ్ళాడు.

సురేశ్ స్కూలు కెళ్లాడు. ప్రభావతి భోంచేసి నిద్ర పోతోంది. అమల తన గదిలో మంచం మీద పడుకొని ఓ పుస్తకం చేతిలోకి తీసుకొని కునికిపాట్లు పడుతూ చదువు తోంది. అప్పుడే ప్రమథ్ బండివచ్చి యింటిముందు నిలబడింది. బండి వచ్చిన చప్పుడు విని, ఆమె మంచం మీద లేచి కిటికీ దగ్గర కొచ్చి తొంగి చూచింది. ప్రమథ్ బండ్లోనించి దిగు తున్నాడు. అతడ్ని చూడగానే ముందు తల్లిని లేపుదామను కుంది. కాని తాను వ్రాసిన ఉత్తరం సంగతి తీసుకొస్తాడేమో నన్న భయంతో ముందు తానే మాట్లాడటం బావుంటుందని నిర్ణానించుకుంది.

అమల క్రింద కెళ్ళి తలుపులు తీసింది. ప్రమథ్ బండి వాడితో సామాను లోపల పెట్టించి, కూలి యిచ్చి పంపాడు.

"మీరు బాగా చిక్కిపోయారే! మీరు పైకి వెళ్ళి నాన్నగారి గదిలో పడుకొని విశ్రాంతి తీసుకోండి." - అంది అమల.

దీనికేం జవాబివ్వకుండానే-"మా అమ్మ ఎక్కడవుంది." అనడిగాడు ప్రమథ్.

"పైనవుంది."

"సురేశ్?"

"స్కూలుకెళ్ళాడు."

"బాబాయిగారు ఆఫీసుకెళ్ళి వుంటారు"

"వెళ్లారు"

"అయితే యిప్పుడు నీవు మినహా మరింకెవరూ లేరు. నాకు తోడు!" - అన్నాడు ప్రమథ్ నవ్వుతూ.

ఆమాట విన్న అమల మొహం కందిపోయింది. కాని, వెంటనే తనను సంబాళించుకొని - "అమ్మ నిద్రపోతోంది. పదండి, అక్కడికే వెళదాం."

"పైకి వెళ్ళేలోపల నీతో ఓ సలహా తీసుకోవాలి"- అన్నాడు ప్రమథ్.

అయిష్టంగా వున్నప్పటికీ - "దేనిని గురించి?" అనడిగింది అమల.

"చూచావుగా, నిన్న బాబాయిగారు రమ్మని బలవంతం చేసినా రాలేదు. ఇవాళ నీ ఉత్తరం చూచి వచ్చేసాను.

లోకులు ఏమనుకుంటారు?" – అన్నాడు ప్రమథ్ అకస్మాత్తుగా గొంతు మార్చేసి.

అతనికి ఉత్తరం వ్రాసి చేసిన తప్పు అప్పుడర్థమైంది అమలకు. ఆ ఉత్తరాన్ని చాటు చేసుకొని ఏదో దాపరికాన్ని నిలబెడుతున్నాడు. ఆమె ఓ క్షణంపాటు నిశ్చేష్టురాలై, తర్వాత వెంటనే నవ్వుతూ – "దీనిని గురించేనా నా సలహా! దాని మాటేమోగాని, యిప్పుడు మాత్రం నీవు నాతో ఇలా చెప్పటం ఏం బాగుండలా." అంటూ తన ఉత్తరం త్రిప్పి యిచ్చేయమంది.

ప్రమథ్ నవ్వి – "అంత తేలికగా యిస్తానా ? నేనంత తెలివి తక్కువ వాడిని కాదులే. ఐనా దానికి బదులుగా మరో ఉత్తరాన్ని యిస్తున్నాను. దీన్ని భద్రంగా వుంచుకో." అంటూ జేబులోనించి ఉత్తరం తీసి ఆమెకందించాడు.

దాన్ని ఓ సారి ఎగాదిగా చూచి – "ఇది ఎవరి ఉత్తరం ప్రమథ్ దాదా ?" అనడిగింది.

ప్రమథ్ నవ్వుతూ – "ఇది నీ ఉత్తరానికి జవాబు. రేపు వద్దామనుకున్నాను. కాని, మళ్ళీ ఎందుకనన్నట్టు ఇవాళే వచ్చేసాను, నీవంటే భయమే, ఏం శిక్షిస్తావో తెలియదుగా ?" అన్నాడు.

అమల మొహం త్రిప్పకొని – "అన్నను చెల్లెలు శిక్షించగలదా ?" అంది.

"ఈ విషయంలో నాకేం తెలియదు, అమలా! నా చిన్నప్పటినించి నా కెలాంటి చెల్లెలుతోనూ సంబంధం

లేదు. నీవు నీ ప్రేమకు తగినట్టు నన్ను శిక్షించుకోవచ్చు. ఈ విషయంలో మాట్లాడటానికి నా కెలాంటి హక్కు లేదు. అదీ కాకుండా, యీ అన్నా చెల్లెలు వరస కూడ నాకంత నచ్చదు. ఇప్పుడంతా సమానమనే ధోరణి నాకు నచ్చుతుంది. ఒకరు చిన్నా, మరొకరు పెద్దా అనేమిటి? తోబుట్టినవాళ్ళు కాకుండా వుంటే వివాహం చేసుకుంటానన్నా నాకు అభ్యంతరం వుండదు. మరి నీవే మనుకుంటున్నావో?" — అన్నాడు నవ్వుతూ ప్రమథ్.

అతని ధోరణి అర్థంచేసుకున్న అమల అసహ్యా భావంతో కుంగిపోతూ — "మీ రేమనుకున్నా నాకు అభ్యంతరం లేదు. కాని, నాకుమాత్రం అవినచ్చవు. అలా అనుకునేవాళ్ళంటే...?" అని ఆగిపోయింది. ఇహ ఆ తర్వాత మాట పెగలలేదు. కంఠం ఒక్కసారి బొంగురు పోయింది.

ఆమె హృదయాన్ని అర్థంచేసుకున్న ప్రమథ్ ఒక్క క్షణంలో ప్లేటు మార్చేసి — "నీవు నా గురించి అలా అనుకుంటూంటే క్షమించు. నా ఎడారి బ్రతుకు చూచి జాలి పడతా వనుకున్నాను. నా జీవితంలో లేని ఆప్యాయత నీ దగ్గరుందని, నీనుండి పొందగలనని ఆశించాను. అంతేగానీ, నీవు నన్ను యీ విధంగా నీచంగా చూస్తావని అనుకోలేదు." అన్నాడు దీన స్వరంతో.

"నేనలా చూడటంలేదు. ప్రమథ్ దాదా!" అంది అమల విస్తుపోయి.

"నన్నలా చూడలేవని నాకు తెలుసు. నీ హృదయం మంచితనం తెలుసుకోలేక పోలేదు. సరే, పదా, పైకి వెళదాం" - అన్నాడు ప్రమథ్.

ప్రమథ్‌ని చూచి ప్రభావతి ఎంతో సంతోషించింది. ఇవాళ అకస్మాత్తుగా యీ బుద్ధి కలగటానికి ఆశ్చర్యపోతూ- "నిన్న ఏమైంది బాబు, యీ బుద్ధి? ఇవాళ తెల్లారేటప్పటికి కలిగింది?" అనడిగిందామె.

ఓ సారి ప్రమథ్ అమలవంక చూచాడు. అమలకూడ అతని చూపుల్లో చూపులు కలిపింది. ప్రమథ్ నవ్వుతూ - "నిన్న నేను చేసింది తప్పని యివాళ తెలిసివచ్చింది. తప్పు చేసిన తర్వాతగా, తెలిసివచ్చేది!" అన్నాడు.

మరొక్కసారి అమలవంక చూచాడు అతడు. ఆమె పెదవులమీద మందహాసం నాట్యం చేస్తోంది. దాని అర్థమేమిటో అతనికి బాగా తెలుసు.

ఆ సాయంత్రం యింటికి రావటంతోటే హరిమోహన్ ప్రమథ్‌ని చూచి విస్తుపోయాడు. అతడు ఆఫీసునుండి వస్తూ వస్తూ హోటలుదగ్గర కెళ్లాడు. అక్కడ ప్రమథ్ లేకపోయే టప్పటికి ఆయన నవనాడులూ కుంగిపోయినై. ఏదో భయం భయంగా యింట్లో ప్రవేశించిన ఆయన ప్రమథ్‌ని చూచి విస్తుపోయాడు. ఆయన సంతోషానికి అంతులేకపోయింది.

హోటలు కెళ్ళి వచ్చానని చెప్పలేకపోయినా, ఆ సంతోషాన్ని విస్మయాన్నిమాత్రం దాయలేకపోయాడు.

ఆ విస్మయానికీ, ఆ సంతోషానికీ వెనుక దాగివున్న హృదయం అమలకు బాగా తెలుసు. దానికి కారణం ప్రమథ్. ప్రమథ్ హృదయంలో అమృతమూ వుంది, విషమూ వుంది. అతడు అమృతాన్ని చూపి విషాన్ని అమ్మగలడు, విషాన్ని చూపి అమృతాన్ని కొనగలడు. అందుకే అమలకు అతడంటే భయం, ఇతరులకు అతడంటే సంతోషం. అతడెప్పుడు ఏ అవతారం ఎత్తుతాడో తెలియదు గదా!

ఆ రాత్రి అతనికి ఏ గదిలో బస యేర్పాటు చేయాలన్న సమస్యమీద పెద్ద తర్జనభర్జనలు బయలుదేరినై. ప్రభావతి, హరిమోహన తమతో పైనే ఓ గదిలో వుండిపొమ్మన్నారు. కాని, అతడుమాత్రం క్రింద బజారు కానుకొనివున్న గది యిస్తే బావుంటుందని చెప్పాడు. ఎలా అయితే పట్టుపట్టి తన మాటనే నెగ్గించుకున్నాడు. అక్కడే అతనికి బస ఏర్పాటు చేయబడింది.

ఆ మర్నాడు అమల – "రాత్రి మీకు బాగా వుక్కపోసి వుంటుంది. ఇక్కడ గాలి అన్నమాట రాదు. పైనే అయినట్లయితే బావుండేది." అంది మామూలు ధోరణిలో ఏమీ మాట్లాడకపోతే బావుండదన్నట్టు.

ప్రమథ్ నవ్వి – "మెస్‌నించి లాక్కొచ్చావ్. ఇంకా దగ్గరకి లాక్కోవాలని వుందా?" అన్నాడు.

ఇది విని అమల మొహం కందిపోయి ఎర్రపడింది. ఆమె తనను సంబాళించుకొని – "ఏం, ఎందుకు లాక్కో కూడదు, దాదా? నీవేం భూతానివా, భయపడటానికి?" అంటూ పకపకా నవ్వింది.

ప్రమథ్ కూడ నవ్వుతూ – " 'భూతా'న్ని అయినట్లయితే భయపడవలసిన పని లేదు. అమలా! కాని, నేను నీభవిష్యత్తుని. అందుకే భయపడుతున్నాను." అన్నాడు.

"ఐనా, నేను భయపడాల్సిన అవసరం లేదు. ప్రమథ్ దాదా! భవిష్యత్తులో నాకు ఎంతో వుపకారం చేస్తానని అమ్మకు మాట యిచ్చావు" అంది అమల నవ్వుతూనే.

"నేను నీకే వుపకారం చేస్తానో, నాకే మంచి చేసుకుంటానో ఎవరం చెప్పగలం? భవిష్యత్తుని గురించి మనం ఏమనుకున్నా పొరపాటు చేసినట్టే!" – అన్నాడు వెంటనే గొంతుమార్చేసి దీనంగా ప్రమథ్.

"భవిష్యత్తుని నమ్మకోకూడదు. నిజమే. కాని, నేను నమ్ముతున్నానని మాత్రం నీ వెందుకనుకోవాలి?" అంది అమల శాంతంగా.

"అంత నమ్మలేనంత కఠినురాల వవుతావా?" – అడిగాడు ప్రమథ్.

"దానిని నమ్మాలంటే ఎంతో గొప్ప శక్తివుండాలి. నా కలాంటి శక్తి లేదు. నే నిలాగే వుందామనుకుంటున్నాను." అంది అమల.

"ఉండగలవా?" అనడిగాడు గంభీరంగా అతడు.

"ఉండగలననే అనిపిస్తోంది." అంది ఆమె అంతే గంభీరంగా.

దానికి మారుగా ఏం మాట్లాడలేకపోయిన అతడు తనలో తానే – "నిజంగా నీవు అలా వుండగలిగితే యీ ప్రపంచంలో నీతో ఆడిన ఆటే మంచిదనుకుంటా" అనుకున్నాడు.

అమల ఈరోజున అతడ్నెదుర్కొంది. అతడిని ఎదుర్కోవాల్సిన అవసరం వుందని ఆమెకు తెలుసు. అందుకే నిర్భయంగా మాటకు మాట చెప్పి సమాధాన పరిచింది. ఈ విషయం అతడు కూడ కనిపెట్టాడు. తన యావశ్చక్తినీ కూడగట్టుకొని ఆమె పోట్లాడుతుందని అతనికి తెలుసు. అందుకే అతడు కూడ తన శక్తినంతటినీ కూడగట్టుకొంటున్నాడు. అందుకోసమే తన కోర్కెను బయట పెట్టకుండానే తప్పుకు తప్పుకు తిరుగుతున్నాడు. ఆమెతో అవసరమైనంతవరకే మాట్లాడుతున్నాడు. ఆమె అతనితో ఏదో సందర్భంలో మాట్లాడటం, అతడు దానికి క్లుప్తంగా సమాధానం యిచ్చి వూరుకోవటం జరుగుతూ వుండేది...

ఈ విధంగా కొద్దిరోజులు గడిచిపోయినై. అకస్మాత్తుగా ఓ నాడు అతడి ఆరోగ్యం చెడిపోయింది. ఈ విషయం తెలియగానే హరిమోహన్ అతని దగ్గరకెళ్ళి "ఎలావుంది, బాబు?" అనడిగాడు.

అతడు వెల వెలా బోతున్న నీలిరంగు దుప్పటి కప్పుకొని – "ఏం బావుండలేదు, బాబాయిగారు! నిన్న కొంచెం

జ్వరం తగిలిందనుకుంటూ, కాళ్ళు లాక్కు-పోతున్నై." అన్నాడు.

ప్రభావతి – "ఇంత మండి పోతుంటే అలా కూచున్నావేం? ధర్మామీటరు పెట్టుకొని చూడు." అంది విస్మయాన్ని ప్రకటిస్తూ.

"ఇది నీవే కొని తెచ్చుకున్నావ్, ప్రమథ్. ఆ రోజునే పైన వుండమంటే ఒప్పుకోక పోయావు." అన్నాడు హరిమోహన్.

ప్రమథ్ నవ్వటానికి ప్రయత్నిస్తూ – "అందువల్ల వచ్చిందని అనుకోకూడదు. అసలు నా ప్రకృతే అంత. కొంచెం వాతం జాస్తి." అంటూ నలువైపులా ఓ సారి ఎగాదిగా చూచి అన్నాడు – "ఏం, గదికేం! బాగానే వుంది. గాలికూడ బాగానే వస్తుంది."

అక్కడే దగ్గరలో నిలబడివున్న అమల నుద్దేశించి – 'అమీ! పైన దక్షిణవేపు గది శుభ్రం చేయి! నీ ప్రమథ్ దాదా అక్కడే వుంటాడు." అన్నాడు హరిమోహన్.

"వద్దు, వద్దు. ఇప్పుడంత తొందరపడాల్సిన అవసరం లేదు. ఇప్పుడు పైకి ఎక్కి వెళ్ళటమన్నా కష్టమే! కాళ్ళ నొప్పులు తగ్గిన తర్వాత పోనీ, అలాగే చేద్దాం." అన్నాడు అభ్యంతరం చెబుతూ ఆదుర్దాగా ప్రమథ్.

ఆ మర్నాడు డాక్టరుగారు కూడ అతడు క్రింద వుండటానికి అభ్యంతరం చెప్పాడు. దాని మీదట హరిమోహన్ అతని మాటల్ని లక్ష్యపెట్టకుండానే పైకి తీసుకెళ్ళాడు.

"ముందే పైకి వచ్చేసినట్లయితే ఈ బాధ తప్పేది గదా ?" అంది అమల.

"బాధలోనే మానవుడు చేరలేని చోటుకుకూడ చేర గలడు. అందువల్ల యీ బాధంటే భయపడాల్సిన అవసరం లేదు." అన్నాడు నవ్వుతూ ప్రమఫ్.

ఆ సందర్భాన్ని మరింత లోతుగా తీసుకుపోతున్నాడని గమనించి ఆమె సంభాషణని మార్చేసింది. అప్పుడుకూడ అతడు వదలిపెట్టక పోయేప్పటికి ఆమె అక్కడనించి వెళ్ళి పోయింది.

ప్రమఫ్ వచ్చిన వెంటనే అమల భయపడినమాట వాస్తవమే! కాని, ఆ తర్వాత ధైర్యం తెచ్చుకొంది. మళ్ళీ అదే భయం ఇప్పుడామెను ఆవహించింది. పోనీ, ఈ విషయం అమ్మతో చెబుదామనుకున్నా, ఏమని చెప్పాలో ఆమెకు తెలియటం లేదు. చెప్పినా యివాళ ఆమె తలిదండ్రులు అతడ్ని నమ్మలేనంత దూరంగాలేరు. అతడు వారికి కావలసిన డబ్బు సహాయం చేసి వారిని కొనేశాడు. అమల యివాళ ఏమైనా చెప్పినా, దానిని ఖాతరు చేయకుండానే త్రోసేసే స్థితిలో వున్నారు. ఈ సంగతి ఆమెకు బాగా తెలుసు.

## 5

రోగాన్నుండి విముక్తి పొందిన తర్వాత, ప్రమఫ్ ఏదో అర్జంటుపనిమీద కాశీ బయలుదేరాడు.

బయలుదేరే ముందు అమల చేతిలో తాళంచెవుల గుత్తి పెడుతూ - "నా ట్రంకు, కాష్‌బాక్స్ తాళం చెవులునైన్జ. నీ దగ్గర ఉంచు. వచ్చిన తర్వాత యిద్దువు గానీ." అన్నాడు.

"నీ దగ్గరే వుంచుకోరాదూ ?" అంది అమల.

ప్రమథ్ నవ్వుతూ - "నా దగ్గరుంటే ఒరిగే లాభమేమీ వుండదు. పైగా పోతుందేమోనన్న భయం ఎప్పుడూ సతా యిస్తూ వుంటుంది. అదీ కాకుండా ఇవి ఇక్కడే వుంటే అవసరమైనప్పుడు డబ్బు వుపయోగపడుతుంది. నేను ఉత్తరం వ్రాస్తే ఓ రెండు వందలు మాత్రం మనీఆర్డరు చేయించు. ఫారంకూడ పెట్టెలోనే వుంది." అన్నాడు.

అమల ఎన్ని సాకులు చెప్పినా లాభం లేకపోయింది. తాళం చెవులు తీసుకోక తప్పలేదు.

వెళుతూ వెళుతూ ప్రమథ్ ప్రభావతి దగ్గర శెలవు తీసుకోటానికి వెళ్ళాడు.

"ఎన్ని రోజుల్లో వస్తావు బాబూ ?" అనడిగిందామె.

"ఎన్నో రోజులోనా ? ఓ వారం రోజుల్లో రానూ ?" అన్నాడు అతడు.

కాని, వారంరోజులు కాదుగదా, పదిహేను రోజులకు కూడ రాలేదు.

డబ్బు యివ్వాల్సిన వాయిదా ఐపోయింది. మానిక్ లాల్ రోజూ వస్తున్నాడు, పోట్లాడిపోతున్నాడు. అతడు చేసే నానా హంగామా భరించలేక బెనారస్ టెలిగ్రాం

యిచ్చాచు. అక్కడనించి జౌన్‌పుర్ వెళ్ళిపోయినట్టు కబురు వచ్చింది.

ఆ టెలిగ్రాం చూచి తింటూన్న పళ్ళెందగ్గరనుండి లేచి నిలబడ్డాడు. ఆయన ముంచుకొస్తున్న కోపంలో అన్నంసంగతె మరిచిపోయాడు.

"మీారలా లేచిపోతే యెలా? వున్న బాధలేవో వుండనేవున్నై. పైగా మళ్ళీ యీ బాధలుకూడ దేనికి?" అంది ప్రభావతి.

వెళుతున్న హరిమోహన్ వెనక్కి తిరిగి - "ఫర్వా లేదు. ఈ ప్రాణం పోయినా బావుండును. ఒక్కసారి బాధలన్నీ పోతై. కాని, నీవు అలా బాధపడాల్సిన అవసరం లేదు. ఈ శరీరం అంతంతమాత్రంచేత పోయేదికాదు." అన్నాడు మండి పడుతూ.

"మీారు మగవారై వుండికూడ అలా మాట్లాడితే మేం చెప్పేదిమాత్రం ఏముంటుంది?" కన్నీరు పెట్టుకొని అంది ప్రభావతి.

"మిమ్మల్నిగురించే యింత బాధ పడిపోతున్నా. నాలాంటి దరిద్రుడి పాలిట బడ్డ మీాకు సుఖం వుండదు. మీా బ్రతుకులు బండలై పోతై. ఇవాళ మీా కోసమనే ఆఫీసులో డబ్బు కాజేస్తే బావుండుననిపిస్తోంది. ఇహ నేను చేయలేని పనిఅంటూ లేదు" - అన్నాడు హరిమోహన్ ఆలోచన కోలోప్పయి.

ఆయనమాటలు విన్న అమలగుండె దడదడ కొట్టు కొంటోంది. రైళ్లు దడదడా పరుగెత్తుతున్నై. ఆమెకు ప్రమథ్ డబ్బుసంగతి గుర్తుకొచ్చింది. అతడికి మనీఆర్డరుకూడ చేయ లేదు. ఆ డబ్బు యిచ్చి ఆదుకోవటం బావుంటుందేమో నను కుందామె. కాని మళ్ళీ ఎందువల్లో ఆమె ఆంతరంగికం అందుకు ఒప్పుకోలేదు. ఆమె నెమ్మదిగా – "నాన్నా!" అంది.

హరిమోహన్ ఏం మాట్లాడకుండానే ఆమె వంక చూచాడు ఆశానేత్రాలతో.

"నాన్నా! నా దగ్గర నగలున్నైగదా? వాటిని అమ్ము కొని ఖర్చు చేసుకుంటే బావుంటుంది కదూ?"–అంది కన్నీరు పెట్టుకొని.

"పోనీ, ఒకటి తీసుకెళ్ళి తాకట్టు పెట్టి పని జరుపుకో రాదా ? వచ్చినపుడు తిరిగి తెచ్చుకోవచ్చు." అంది ప్రభావతి కూడ యింకేమీ దారిలేనట్టు.

ప్రభావతి మాటవిని నవ్వుతూ – "ఆ పరిస్థితి వస్తుందని అనుకోవటంకూడ పొరపాటే!" అంది.

నగ తీసుకోవటానికి యిష్టపడటం లేదని అమల గమ నించి వ్యగ్రురాలై – "పోనీ, ప్రమథ్‌దాదా వచ్చినతర్వాత విడిపించుకోవచ్చుగా!" అంది.

ఎందువల్లనో ప్రమథ్ పేరు వింటేనే కోపంతో ముద్దయి పోతున్న హరిమోహన్ – "అలా జరగటానికి వీల్లేదు. అంత కంటే వీటిని అమ్మేయటమంటేనే నాకు బావుంటుంది. ఓసారి అతడు డబ్బు యిస్తానంటేనే అభ్యంతరం చెప్పబోయిన నీవు

యివాళ అతను విడిపించిన నగలు పెట్టుకుంటాననటున్నావా!" అన్నాడు.

ఆమాట వినేప్పటికి ఆమె మొహం కందగడ్డయింది. ఓసారి తన హృదయాన్ని విప్పి చెబుదామనుకుంది. కాని, వర్తమాన పరిస్థితిని ఆలోచించి చెప్పలేకపోయింది. ఆమె తనను సంబాళించుకొని – "ఆ విధంగా నా మనసొప్పటం లేదు. అందుకేయీ నగల్ని అమ్మేయండి. డబ్బుంటే ఏదోనాడు కొనుక్కుంటాం." అంది.

తన గొడవలోతాను కొట్టుకుపోతూ అమల చెప్పిన దానిని వినకుండానే – "ప్రమథ్ నాకెలాంటి బంధువూకాదు ఏదో కొద్ది డబ్బు సహాయం చేసేడని అతడిని నా యింట్లో పెట్టుకోలేను. తిరిగి రావటంతోటే ఏదొహ యేర్పాటు చేసుకోమంటాను." అన్నాడు.

ఈ అసందర్భపు మాటవిని ప్రభావతి విస్తుపోయింది. తాను చేసిన తప్పుని యితరులమీద ఆరోపించటంలోగల న్యాయమేమిటో ఆమెకు బోధపడటంలేదు.

అమల ఆలోచించే స్థితిలోగూడ లేదు. "అమ్మా! నా గొలుసు తీసుకొచ్చి నాన్న కివ్వు. వారిప్పుడే ఆఫీసు కెళ్ళి పోతారు. టైం అయిపోయింది." అంది.

ఆఫీసుడబ్బు కాజేసి ఉద్యోగానికి ఉద్వాసన చెప్పి, జీవితానికి తిలోదకాలివ్వటం కంటె ఆ గొలుసు తీసుకొని అమ్ముకోవటమే తెలివిగల పని అని, హరిమోహన్‌కి తెలుసు. ఆయన చాల జాగ్రత్తగా గొలుసు తీసుకొని భద్రంగా

జేబులో పెట్టుకొని ఆఫీసు కెళ్ళిపోయాడు. కాని, ఆఫీసునుండి వస్తూ దానిని అమ్మకుండానే మళ్ళీ భద్రంగా యింటికి తీసుకొచ్చాడు.

ఆఫీసునుండి వస్తూనే – "నన్నింత కష్టపెట్టి అవమానపాలు చేస్తే నీకు ఒరిగేదేమిటి, అమలా?" అన్నాడు.

"అదేమిటి అలా అంటున్నావు నాన్నా!" అంది.

"నీ దగ్గర ప్రమథ్ డబ్బు వుందటగా. నాకివాళే ఉత్తరం వ్రాసాడు. నీవు రోజూ చూస్తూనే వున్నావుగా, డబ్బుకి బాధపడటం. ఒక్కసారైనా జాలి కలగలేదా?"

"డబ్బు నా దగ్గరలేదు. కాష్‌బాక్స్ మాత్రం వున్నమాట నిజమే!"

"తాళంచెవులు ఎవరిదగ్గర వున్నై?"

"అవి నాదగ్గరే వున్నై"

"పెట్టెలో డబ్బుందా?"

"ఉంది."

"ఎంత?"

"నాకు సరిగ్గా తెలియదు."

"ఐనా యీ విషయం నాతో ముందు ఎందుకు చెప్పలేదు? ప్రమథ్‌కి నీవు ఐనదానివీసీ, నేను పరాయివాడినా?"

ఆ మాట వినేప్పటికి అమల మొహం జేవురించింది – "నా కలాంటి అభిప్రాయం లేదు నాన్నా! వారి అనుమతి లేకుండా మనం డబ్బు ఖర్చుపెట్టుకోవటం బావుండదనే నేననుకుంది. అందుకే మీతో ఆ విషయం చెప్పలేదు." అంది,

హరిమోహన్ జేబునుండి ఉత్తరం చూపుతూ – "ఇదిగో ! ఈ ఉత్తరం వచ్చింది. ఇది చదువుకొనైనా డబ్బు యివ్వావచ్చో, లేదో నిర్ణయించుకో !" అన్నాడు.

"నాకు యెందుకు అది ? మీరు మొహం చేతులూ కడుక్కోండి. పెట్టె తీసుకొచ్చి, మీ ముందే పెడతాను." అంటూ ఆమె ఎంతో బాధపడుతూ లోనికెళ్ళి పెట్టె తీసుకొచ్చి తండ్రి ముందు పెట్టింది.

హరిమోహన్ పెట్టె తెరిచి అమలతో – "చూడు, యిందులో యెంత డబ్బుందో ?" అన్నాడు.

అమల డబ్బు లెక్కపెట్టి – "ఐదువందల డభ్భై అయిదు రూపాయిల పన్నెండు అణాలు వున్నై." అంది.

"సరే, నాకు ఓ నూటయేభై రూపాయిలు కావాలి. ఇవ్వు !" అన్నాడు ఆయన.

"నీవు తీసుకోవచ్చుగా. మళ్ళీ నే నెందుకు ?" అంది అమల.

"పెట్టె అప్పజెప్పి పోయింది నీకుగానీ, నాకుకాదుగా!" అన్నాడు ఆయన.

అమల మారు మాట్లాడక లెక్కపెట్టి నూట యాభై రూపాయిలు తీసి ఆయన ముందుపెట్టింది.

ప్రభావతి భయపడుతూ భయపడుతూ – "ప్రతి నెలా డబ్భై అయిదు రూపాయిలేగా తీసుకొనేది, అంతే తీసుకుంటే సరిపోదు ?" అంది.

"మీకేం తెలుస్తుంది? ఈ నెల ఇన్సూరెన్స్ ప్రీమియం కూడ కట్టాలి." అని యింకా ఏమేమో గొణుక్కుంటూ ఆయన వెళ్ళిపోతూంటే అమల ఆయన్ని పిలిచి – "ప్రమద్ దాదా పెట్టెలో యీ గొలుసు పెడితే బావుంటుందేమో!" అని అంది.

"బాగానే వుంటుంది. అందులో మామూలుకంటే ఎక్కువ కూడ తీసుకొంటున్నాం. కాని, అతడు తిప్పి యిచ్చేస్తే...?" అనడిగాడు సంకోచిస్తూ ఆయన.

"నేను తీసుకోను." అంది ఆమె.

"అతడు వచ్చి గట్టిగా తీసుకోమంటే మాత్రం మనం కాదనటం కూడ అంత బావుండదు. అతడు మన వాడని మనం అనుకుంటూ అ భేదభావం చూపటం బావుండదు" అంటూ ఆయన ఉత్తరం ప్రభావతి కందిస్తూ – "ఇదిగో! నీవే చూడు! ఉత్తరం యెలా వ్రాసాడో!" అని మళ్ళీ అమలవైపు తిరిగి అన్నాడు "నిన్న నేను ఏదో తెలియని ఉద్రేకంలో ఏమేమో అన్నా, అవి అతనికి తెలియకూడదు. తెలిస్తే బాధపడతాడు."

అమల ఇహ అక్కడ నిలబడి వుండలేకపోయింది. తన అంధకారమయ జీవితం చుట్టూ కమ్ముకున్న మేఘాల్ని గురించి ఆలోచించుకుంటూ వాటిని ఎదుర్కోవటానికి అవసరమైన శక్తినివ్వమని భగవంతుడ్ని ప్రార్థించుకుంటూ మంచం మీద పడివుంది.

ఎన్నో రోజులకి ప్రమథ్ తిరిగివచ్చి తన బాక్స్‌లో నుండి అమల గొలుసు తీసి నవ్వుతూ - "అమలా ! నా పెట్టె నీ చేతిలోపడి చాల అద్భుతమైన శక్తిని సంపాయించుకుంది, సుమా ! ఇందులో చాల అద్భుతమైన శక్తివుంది, చూడు !" అన్నాడు.

"అవును, దాంట్లో వున్నవి కూడ ఆ విధంగానే మాయమై పోయినై." అంది అమల నవ్వుతూ.

"అలా మాయమవ్వటం మంటేనే నాకు తగనియిష్టం. నా యిష్టానికి వ్యతిరేకంగా నీ వేం చేయకు. నీ గొలుసు నీవు తీసుకో." అన్నాడు అతడు. అతడిదువరకే యీ విషయం హరిమోహన్ చెప్పగా విన్నాడు.

అమల ఎంత చెప్పినా తీసుకోవటానికి ఒప్పుకోకపోయే టప్పటికి ప్రమథ్ - "నా డబ్బు ఖర్చు పెట్టుకోవటానికి నీ కెలాంటి అధికారం లేదే అనుకుందాం. కాని, నా డబ్బు తాకట్టు పెట్టుకొని అప్పు ఎవ్వరివ్వమన్నారు ? ఆ అధికారం మెక్కడనించి వచ్చింది ? నీ కున్న ఆత్మాభిమానం నాకూ లేకపోలేదు. ఓ స్త్రీ గొలుసు తాకట్టు పెట్టుకొని డబ్బు ఇవ్వటం నాకు చేతకాని పని" అన్నాడు ఎదురుదెబ్బ తీస్తూ.

దానికేం జవాబివ్వాలో తెలియక అమల రెండు చేతులూ జోడించి - "పోనీ, నేను తప్పు చేసాను. నా తప్పుని క్షమించండి. ఈ సారికి ఒప్పుకోండి" అంది.

"ఇది తప్పుకాదు. అగౌరవ పరచడం, ఒకర్ని బాధ పెట్టడం. అన్యాయంగా ఒకర్ని బజారుకి లాగటం లాంటిది.

నీవు ఏ మాత్రం ఆలోచించినా అలా అనవు. పోనీ, నీకవన్నీ తెలియవనుకునే నా దగ్గరే వుంచుతాను. ఓ నాడైనా కనీసం నీవు నీ తప్పుని గ్రహించి నీ గొలుసుని తీసుకుంటావని ఆశిస్తా. ఇహ నీవు వెళ్ళ వచ్చు!" అన్నాడు ప్రమథ్ గంభీరంగా.

అమల కాసేపు మౌనంగా నిలబడి ఆ తర్వాత అక్కడ నించి వెళ్ళిపోయింది. వేటగానికోసం కూడ లేడి అప్పుడప్పుడు బాధపడటం జరగవచ్చు!

■

రోజులు గడచి పోతున్నై. ప్రమథ్ బయటకు వెళు తున్నప్పుడల్లా తాళం చెవులు మాత్రం అమలకు యిచ్చి పోతున్నాడు. మొదట్లో ఒకటీ రెండు సార్లు ఆమె అభ్యం తరం చెప్పింది; కాని తర్వాత అలా చెప్పినా ప్రయోజనం లేకపోయేటప్పటికి అదీ మానేసింది. యీ మధ్య ప్రమథ్ ప్రవర్తనలో ఏం మార్పు లేకపోయేటప్పటికి అతని తీరే అంతే నేమో ననుకుని సంతృప్తి పడింది. కాని, ప్రమథ్‌కి అలాంటి అభిప్రాయం లేదు. అతడు యిప్పటికీ కూడ వల పన్నుతూనే వున్నాడు. కాని, జాగ్రత్తగా, పొంచి పొంచి...

ఓ రోజున వర్షం పడుతోంది. తెల్లవార్లూ జోరున కురిసిన వర్షం తెల్లారిన తర్వాత కొంచెం తగ్గిందన్న మాటే గాని, పూర్తిగా మాత్రం పోలేదు. ఆకాశంలో మబ్బులు కూడ కమ్ముకొని వున్నై. ప్రమథ్ తన గదిలో కూచొని

ఉదాసీనంగా వున్న ప్రకృతివంక చూస్తూ ఏదో ఆలోచనలో మునిగి తేలుతున్నాడు. అప్పుడే అమల, ఫలహారం టీ తీసుకొచ్చింది.

అమల దగ్గర నుండి ఫలహారం, కాఫీ అందుకొని - "అమలా ! నీతో కొంచెం మాట్లాడాలి. కాసేపు కూచో !" అన్నాడు.

"ఏం మాట్లాడాలి? ఆలస్య మౌతుందా?" అనడిగిందామె అతని వంక చూస్తూ.

"ఆఁ, కొద్దిగా ఆలస్యమైతే అవ్వొచ్చు !"

"అలా అయితే అభ్యంతరం లేకపోతే వంట చేయటం అయిపోయిన తర్వాత వస్తాను."

"ఓ, అలాగే! పనీ పాటా పూర్తి చేసుకునే రా !"

అమల క్రింద కెళ్ళిపోయి, వంటపని చేస్తున్నా ఆమెకు యిదే ఆలోచన, అతడేవిషయాన్ని గురించి చెపుతాడా, అని. చివరికి ఓ అరగంటలో పని ముగించుకొని అతని దగ్గర కెళ్ళింది.

"ఏమిటా విషయం, ప్రమథ్ దాదా ?" అంటూ.

ఉత్తరం వ్రాసుకుంటున్న ప్రమథ్ - "కూచో, ఇప్పుడే రెండు నిమిషాలలో వస్తా!" అన్నాడు.

కొద్ది దూరంలోవున్న కుర్చీలో చతికిలబడి ఆమె బయటకు చూస్తూంది. అప్పుడే వర్షం తీవ్రమైంది.

ఉత్తరం వ్రాయటంముగించి అతడు ఆమెవంక ఓ సారి చూచి - "నిన్న సాయంత్రం నుండి యీ మాట చెబుదా మనుకుంటున్నాను. కాని, నీతో చెప్పాలో, మాఅమ్మతో

చెప్పాలో లేక బాబాయితోనే చెప్పాలో తెలియక తికమక పడుతూ చెప్పలేక పోయాను. చివరికి నీ తోనే చెబితే బావుంటుందని తీర్మానించుకున్నాను. అప్పుడు అవసరమైతే వారితో చెబుదామనుకున్నాను.” అన్నాడు.

“అయితే నా తోనే చెప్పు!” అని అమల అతని వంక ఓ సారి జిజ్ఞాసు నేత్రాలతో చూచింది.

“నిన్న సాయంత్రం విజయని కలుసుకున్నాను.” అని అతడు ఆగిపోయాడు. ఆమె మొహం జేవురించింది.

“ఈ విషయం అమ్మతో చెబితే బావుంటుందనుకుంటూ. వారితోనే మాట్లాడితే...” అందామె. ఆగిపోయింది.

“అవును. నిజమేననుకో. వారితోనే మాట్లాడితే బావుంటుంది. కాని, నీవు కూడ వినవచ్చు గదా!” అన్నాడు అతడు.

అతని మాటవిని ఆమె నవ్వి – “సరే! ఈ విషయంలో నేను చెప్పాల్సిందేమీ లేదు.” అంది.

“ముందే నీవు చెప్పకుంటే ఏం ప్రయోజనం? నేను చెప్పేది విను! ఆలకించు! ఆ తర్వాత ఏదైనా చెప్పు!” అన్నాడు అతడు.

వినాలని లేకపోయినా, యిహ తప్పదనుకొని – “సరే, చెప్పు!” అని మాత్రం వూరుకుంది.

“నీలాగే ముందు ఆఁ ఊఁ అన్నాడు. చివరికి ఎలా అయితే 'యీ విషయంలో నేను చెప్పేదీ లేదు, నీవు వినేదీ

లేదు' అని ఖండితంగా తేల్చి చెప్పాడు. కాని అతని మన స్తత్వం ఏమిటో బోధ పడలా. పోనీ. గోవిందనాథ్‌నన్నా కలుసుకొని మాట్లాడదామని చూచాను. కాని ఏం ప్రయోజనం లేక పోయింది."

అతడ్ని మధ్యలోనే ఆపి – "ఇంతేనా ? ఇంకేమన్నా వుందా, చెప్పాల్సింది?" అనడిగిందామె.

"వారుకూడ ఖండితంగానే తేల్చి చెప్పారు. పైగా వా రబ్బాయి పెళ్ళికి కావలసిన యేర్పాట్లనుకూడ చేసు కున్నారు. రేపు మాఘమాసంలోనే లగ్నాలు పెట్టుకున్నారు"

అమల ఇహ ఆ తర్వాత వినలేకపోయింది. ఆమె కళ్లు ఒక్కసారి బైర్లు కమ్మాయి. చుట్టూ చీకట్లు దట్టంగా కమ్మాయి. కాసేపటికి తేరుకొని మనస్సుని దిట్టపరుచుకొని – "కాని, ప్రమథ్ దాదా ! ఈ విషయంలో నేను చెప్పాల్సిందీ, చేయా ల్సిందీ ఏముందంటారు?" అంది.

"నీవు చేసేది లేకపోయినా, చెప్పేదిమాత్రం చాల వుంది. నీవు ఏం చెప్పినా నేను వినటానికి సిద్ధంగానే వున్నాను" అన్నాడు అతను.

అతడివంక ఓసారి అయిష్టంగా చూచి – "నేను నీతో ఏం చేయమని చెప్పటంలేదు. నీవు యీ వ్యవహారంలో తల దూర్చవద్దనే నా మనవి. ఎందుకు లేనిపోనీ బాధ పడతావు. నా రాత ఎలా వుంటే అలా జరుగుతుంది. మధ్యలో నీ వెందుకు బాధ పడతావు?" అని అంది.

ప్రమథ్‌కి కూడ కొంచెం కష్టం కలిగింది - "అయితే నీవు యిలాగే వుండిపోతావా? నా కష్టం సంగతి నీ కెందుకులే!" అన్నాడు కోపంతో.

"ఆఁ, అవసరమైతే తప్పక వుండగలను. ఎలాగూ యింతకాలం గడపాను. ఇహ కష్టమౌతుందా? అయినా, వారు మళ్ళీ వివాహం చేసుకుంటారని నేను నమ్మలేను." అందామె.

"ఓహో, అలాగా! అయితే అలా అనుకోవటానికి ఆధారమేమిటో కాస్త శెలవిద్దూ?" అన్నాడు వ్యంగ్య ధోరణిలో.

"నమ్మకానికి ఆధారమేమో వుండదు, ప్రమథ్ దాదా! నమ్మకమే నమ్మేటట్లు చేస్తుంది." అంది.

ముందు కాసేపు విసుగుతో చూచి, ఆ తర్వాత మళ్ళీ ధైర్యం తెచ్చుకొని - "అదికాదు, అమలా! నీవు అలా మంకుపట్టు పట్టి కూచుంటే ఎలా? రోజూ యీ ప్రపంచంలో ఎన్నో క్రొత్త క్రొత్త సంఘటనలు జరుగుతూవుంటై. అలాంటి వాటిలో యిదొకటి. నీవు అలా నమ్ముతున్నావంటే అర్థం లేదన్నమాట! ఇదేనా పతిభక్తి?" అన్నాడు.

"ఆఁ, ఇదే కావచ్చు. కాని, దానివిలువ నీవు తెలుసుకోలేవు. అలాంటి సంబంధం మరి నీకు లేదుగా!" అని నవ్వింది అమల.

దెబ్బతిన్న ప్రమథ్ ఒక్కసారి గుక్క త్రిప్పుకొని- "నీకు అలాగే వుంటుంది మరి. కాని, నీవు చిన్నపిల్లవు. నీతో

యీ విషయాలన్నీ చెప్పటంకూడ కష్టమే! కాని ఒక్కటి మాత్రం నిజం. హృదయంలేని ప్రేమ, అర్థంలేని ఆదరణ ఎందుకూ పనికిరానిది. ఇదిమాత్రం తెలుసుకో. దీనిని సతీత్వం-అన్నా సరిపోదు." అన్నాడు 

ఇన్ని రోజులకి ఆమె నిలబడి అతనితో మాట్లాడు తోంది. ఆమె సతీత్వానికి జరుగుతున్న అపచారాన్ని సహించలేక పోయింది. ఆమె దెబ్బతిన్న నాగుబాములా హుంకరిస్తూ - "నా సతీత్వానికి యెట్టి విలువా లేకపోతే, నా నుండి యెట్టి ప్రోత్సాహాన్ని పొందక పోయినప్పటికీ నన్నీ విధంగా వెంటాడుతున్నావంటే, నా యింట్లో మకాం పెట్టి నానా విధాల డబ్బు కుమ్మరిస్తున్నావంటే అర్థమేమిటో చెప్పు!" అని అడిగింది. ఆమెకు ముచ్చెమటలు పోసినై.

మురిదు యిది విని అతడు నిశ్చేష్టుడై పోయాడు. ఆమె యింత సాహసం చేయగల్గుతుందని అతడిదువరకెన్నడూ అనుకొని వుండలేదు. కాని, ఆ వెంటనే తాను చెప్పదామనుకున్న సంగతి ఆమే స్వయంగా చెప్పేప్పటికి అతడు యెంతో సంతోషించి, ఓడిపోయిన వాడిలా మొహం పెట్టి - "ఇంతకీ అసలు సంగతి తెలిసిందన్నమాట!" అన్నాడు.

"మొదటి రోజునే!" అంది విజయ దర్పంతో ఆమె.

"బాగు! బాగు! ముందే తెలుసుకొని నీవు నా ఎడ చూపిన కనికరానికి కృతజ్ఞత. నా అభిప్రాయం తెలిసివుండీ కూడ నీవు అలా ప్రవర్తించావంటే అర్థమేమిటో చెప్పొదూ?" అనడిగాడు అతడు.

ఆమె మొహాన కత్తితో పొడిచినా నెత్తురుచుక్క లేనంత పనయింది. దానికి ఏం జవాబివ్వాలో వెంటనే తట్టక కొంచెం తికమకలో పడింది.

అమల యీ స్థితి గమనించి, తానుకూడా బాధపడుతూ "అనవసరంగా ఈ విధంగా ఒకార్ని మరొకారు దుయ్యబట్టుకున్నందువల్ల ప్రయోజనం లేదు. నీవు ఎలాగూ గ్రహించానంటున్నావు. కాబట్టి నేనుకూడ చెప్పేస్తున్నాను. నీ ఊహ సరైనదే! అందులో తప్పేమీ లేదు. నేను యిదంతా చేసింది, చేస్తున్నది నీకోసమే! కాని, నీవు అన్నమాట ఒక్కటిమాత్రం నచ్చలేదు. బలవంతం చేస్తున్నట్టు చెప్పావు. అది మాత్రం అబద్ధం. అలాంటివి నాకు నచ్చవు. అనవసరంగా నామీద ఆ నెపం మోపకు. నేను ఎంతో ఓపికతో చూస్తున్నానేగాని, నిన్ను బలవంతంపెట్టిన పాపాన పోలేదు. నేను అలా చేసినట్లయితే యిక్కడ వుండగలిగేవాడినేకాదు. ఎప్పుడో పంపించి వుందువు." అన్నాడు.

అతడు యింకా చెప్పుకుపోతూనే వున్నాడు – "నేను నిన్ను ప్రేమిస్తున్నాను. ఆరాధిస్తున్నాను. నా హృదయపీఠం మీద కూచోపెట్టుకొని పూజిస్తున్నాను. కాని, అలాంటి దానిని నీవు చాల తేలికగా తోసేస్తున్నావ్. నీవు దీనిని ఏ విజయదగ్గరకూడ పొందలేవు సుమా!"

"అవును. నేనుకూడ అదే చెబుదామనుకుంటున్నాను. నీవుకూడ ఆ గౌరవాన్ని, ఆ ప్రేమను పొందలేవు." అందామె. ఆమె శరీరం వణకిపోతోంది.

"అవును. నీ ప్రేమ చాల దివ్యమైనటువంటిది. కవులు దానిని తప్పక స్తుతించగలరు. ఉన్నదానిని వదలుకొని, లేని దానికోసం తపించటం నిజంగా ఓ అద్భుతమైన పనే! ఆపనే నీవు చేస్తున్నావు. ఇదంతా పిచ్చివాళ్ళ లక్షణం. తెలివిగల వాళ్ళు ఎప్పుడూ అలా చేయరు." అన్నాడు అతను.

"నీకు ఏం తెలియదనుకుంటూ, ప్రమథ్ దాదా? నీకు భగవంతుడు లేడు. మంచీ, చెడూ తెలియదు. హృదయం అర్థం కాదు" అందామె అవహేళనతో.

కాని, ప్రమథ్ చలించలేదు. అతడేమీ సిగ్గుపడకుండా నవ్వుతూ కూచున్నాడు. నెమ్మదిగా తలాడిస్తూ గద్గద కంఠంతో – "నాకే తెలియని యీ విషయాలు నీ కేం తెలుస్తాయి, అమలా! భగవంతుడ్ని నీవు ఎప్పుడైనా చూచావా? ధర్మాన్ని, అధర్మాన్ని గ్రహించావా! పాప పుణ్యానికి మధ్యగల తారతమ్య భేదాన్ని గ్రహించ గలిగావా?" అన్నాడు.

అతడి మాటకు ఏం జవాబివ్వకుండానే మొహం తిప్పు కొని బయటకు చూస్తూ వుండిపోయింది.

అతను యింకా చెప్పుకుంటూ పోతున్నాడు. – "నా మాట విను, అమలా! నీకు తెలియక పోగా నన్ను కూడ మభ్యపెట్ట చూస్తున్నావు. నీవు అనుకొనే మంచీ, చెడూ, పాపమూ, పుణ్యమూ, మానవ కల్పితాలు. సంఘం కోసం కల్పించబడ్డవి. నీవు చేస్తున్నదే పతిభక్తి అనుకొని సంతృప్తి పడుతున్నావు. అది గుడ్డితనం కాని మరొహటి

కాదు. ఇహ స్వర్గమంటావా? చచ్చి ఏం చేస్తారో, ఎక్కడ కెళ్తారో యింతవరకు ఎవరూ తెలుసుకోలేదు. అదంతా మిథ్య. ఆ మిథ్యకోసం యీ వున్న శరీరసౌఖ్యం కాదనటం ఆత్మవంచన. కాని యీ విషయాలన్నీ నీవు యెలా అర్థం చేసుకోగలవు, అమలా! గుండెమీద చేయి వేసుకొని, పాప పుణ్యాలంటేనూ, మంచీ చెడంటేనూ నీకు నమ్మకం వుందేమో ఒక్కసారి నాకు చెప్పు!"

"అవన్నీ నీకు అనవసరం. ఆవిషయాల్ని గురించి నీతో చర్చించాల్సిన అవసరం నాకు లేదు. కాని, ఒక్కటిమాత్రం చెపుతున్నా. నీవు ఆశించిన మార్పు నాలో రాదు. ఎప్పటికీ రాదు. వస్తా!" అంటూ రెండు అడుగులు ముందుకేసి – "నీవు మా అతిథివి. నిన్ను వెళ్ళిపొమ్మని చెప్పటంబావుండదు. వుండు. కాని, వుండవలసిన పద్ధతిప్రకారం మాత్రం వుండు." అనంది. ఆమె ఉత్తేజితురాలై గడగడ వణకిపోతోంది.

అమల జవాబు విని విస్తుపోయి, బాధపడ్డాడు అతడు. కాని, చివరిమాట విని వూరుకోలేకపోయాడు – "అంటే అలా వుండకపోతే గెంటించుతావా?" అనడిగాడు.

"తప్పక. కాని, నీవు నీ డబ్బు ఆహంతోనే అలా అడగగల్గుతున్నావా, అని అడుగుతున్నాను." అందామె.

"నన్ను ఏమన్నా బావుంటుంది. ఎంత తీసివేసినా ఒప్పుకుంటాను. కాని, నీవనుకునేటంత నీచుణ్ణిమాత్రం కాజాలను. నీవు నీ విజయుని ఫోటో పూజిస్తూ వుండు. నా కభ్యంతరం లేదు. కాని, నన్ను మాత్రం అవమానించకు.

"నా తప్పు ఒక్కటే, - నిన్ను ప్రేమించటమే!" అన్నాడు అతడు దీనకంఠంతో- "నీవు నా హృదయాన్ని అర్థం చేసుకో లేవు. అర్థం చేసుకోగలిగితే కనీసం అలా మాట్లాడవు. ఇహ నేను చెప్పేదేమీ లేదు. నీవు వెళ్లి రావచ్చు."

భావ సంఘర్షణలో ఆమె హృదయం కొట్టుకొంటోంది. ఆమె సజల నేత్రాలలో - "నేను నీ మనస్సుకి కష్టం కలిగించిన నన్ను క్షమించు, ప్రమథ్ దాదా! కానీ, నేను చేసిందీ తప్పుకూడా కాదని నీవు అనుకుంటావు!" అంది.

"లేదు. నీవేం తప్పు చేయలేదు." అంటూ తన వణికి పోతున్న హృదయాన్ని మరోవేపుకి మరల్చాడు.

కొంచెం సేపలాగే నిలబడి, అమల నెమ్మది నెమ్మదిగా అక్కడనించి వెళ్ళిపోయింది.

వర్షం ముమ్మరంగానే కురుస్తోంది.

వర్షం తగ్గిపోగానే ప్రమథ్ బయటకెళ్ళి పోయాడు. వెళుతూ వెళుతూ ప్రభావతితో తానేదో పని మీద వెళుతున్నానని, సాయంత్రానికి రావటం పడదేమోనని చెప్పి పోయాడు. వంటకూడ చేయవద్దని చెప్పాడు.

కొంచెం సేపుండ తర్వాత హరిమోహన్ అమలను పిలిచి ఏమేమిటో చెప్పి, చివరకు తనకు యిప్పుడు నాలుగు

వందల యాభై రూపాయిలు కావాల్సి వుందని, కాని ఓ రెండు వందల యాభై రూపాయిలలో పని జరిపేయగలనని చెప్పాడు. ఆ మాత్రం తప్పకుండా చేయాలని, లేకపోతే ఉద్యోగమే పోతుందని చెప్పాడు.

ఆమె కేం చెప్పాలో తోచలేదు. అవమాన భారంతో, కుంగిపోతూ – "ప్రమథ్ దాదా దగ్గర డబ్బు తీసుకునేకంటే నా నగలు నమ్మి మీరు యెందుకు వుపయోగించుకోరూ ?" అనడిగింది.

అమల ఆ ప్రస్తావన తీసుకొస్తుందని అతనికి తెలుసు – "అలాగే పోనీ ఆ గొలుసు అతని దగ్గరే పెట్టి డబ్బు తీసుకో. మళ్ళీ సర్దేసినప్పుడు మనం మన గొలుసు తీసుకోవచ్చు" అన్నాడు.

"పోనీ, మీరే అడగవచ్చుగా !" అంది నెమ్మదిగా అమల.

"ఏం ? ఎందువల్ల ?..." అనడిగాడు ఆయన విస్మయాన్ని కనబరుస్తూ.

ఈ ప్రశ్న సమాధానం యివ్వకుండానే అమల మెదల కుండా చూస్తూ వుండిపోయింది.

"ఎవరు ఎవర్ని అడిగితే బావుంటుందో, పని జరుగు తుందో నీకు తెలియదా ? మళ్ళీ ఆ సంగతి కూడ నాతో చెప్పించాలని వుబలాటంగా వుందా ?" అనడిగాడు ఆయన కోపంతో.

ఆయన మాటల కర్థమేమిటో అమల గ్రహించింది, విహ్వాలచిత్తయై తండ్రివంక చూస్తూ వుండిపోయింది ఒక్క క్షణం - "అదేమిటినాన్నా ! అలా అంటావు ?" అనిమాత్రం అనగల్గింది.

"మరి లేకపోతే, యింట్లో యింతమంది వుండగా మొన్న తాళంచెవులు ఎవరికిచ్చిపోయాడు?" అనడిగాడు తండ్రి ఆలోచనశక్తి కోల్పోయి, ఆయన యింకా ఏమేమో తనలో తానే అనుకుంటూ కూచున్నాడు. కాని అమలమాత్రం అది వింటూకూడ వినలేక యింతకుముందు జరిగిన సంఘటనని సింహావలోకనం చేసుకుంటోంది.

ఆయన చెప్పటం ముగించిన తర్వాత -"సరే నాన్నా! అలాగే ఏర్పాటు చేస్తా!" అంది.

హరిమోహన్ కూతుర్ని బుజ్జగించటానికి ప్రయత్నించాడు. కాని, ఆమె హృదయంలో అగ్ని రగుల్కొంటోంది. కొద్ది నీటిబొట్లు ఆ మంట నార్పలేవు. ఆమె వెళ్ళి జరిగిన సంగతంతా తల్లికి చెప్పింది.

"అవును. అంతకంటె చేసేదిమాత్రం ఏమిటి ? డబ్బుకి తప్పక యేర్పాటు చేయవలసిందే ! ఉద్యోగం పోతే తిండి ఎట్లా ?" అంది ప్రభావతి అంతావిని.

"అందుకోసమని డబ్బు నేను చూడాలా? నీవుమాత్రం ఎందుకడగకూడదు?" అంది అమల.

ఆ మాట విని ప్రభావతి కోపం తెచ్చుకుంది - "నీవు యీ మధ్య ప్రతిచిన్నదానికీ కోపం తెచ్చుకుంటున్నావు.

డబ్బు బాధ్యత నీదేనని ఎవరన్నారు ? నీవు అడిగితే తేలికగా వస్తాయికదా, అని అందుకే నిన్నడగమంటున్నారు. ఇందులో అంత కష్టమైనదేముంది ” అని అడిగింది నిష్ఠూరంగా.

“నేనడిగితే యిస్తూంటే, మీ రడిగితే యివ్వకుంటే, దాంట్లోనే తెలుస్తోందిగా జరిగే అన్యాయం, అపచారం ? ఇంకా నేను చెప్పేదేముంటుంది ?”

“నాకేమో తెలియదమ్మా ! నీ యిష్టం వచ్చినట్టు చేసుకో ! పోనీ అందర్నీ ఆకలితో చంపాలనుకుంటూంటే అలాగే చేయి !”

“అలా నే నెప్పుడూ కోరటం లేదు. అలా అని నే నెప్పుడు ఆత్మాభిమానాన్ని అమ్ముకోవాలన్నా కష్టమే !”

“అబ్బో ! ఎక్కడనించి వచ్చిందంటే యీ ఆత్మాభిమానం ? నిన్ను అంతగా చూచుకునే ప్రమథ్ దగ్గరేనా నీ యీ ఆత్మాభిమానం ? నీకు అంతకంటే ఆత్మీయుడు యెవరైనా వున్నారా ?”

కన్నతల్లి అన్న యీ మాటల్లో దాగివున్న పరమ సత్యం అమలకు తెలుసుకోవటంలో అట్టే టైం పట్టలా. ఆమె వ్యంగ్యాన్ని యిట్టే కనిపెట్టి – “నీవు అలాఅనటం పొరపాటు. నే నెప్పుడూ అతడ్ని అంతగా చూచుకోలేను. నీవు తల్లివై వుండీ కూడ నా మనస్సుని అర్థం చేసుకోలేదంటే యిహ నేం చెప్పేదేముండదు. డబ్బు నే నడిగితే వస్తుందని తెలుసు. దానికి అంత బాధ కూడ పడాల్సిన అవసరం వుండదు. రేపే

మీకు డబ్బు యిస్తాను.” అంటూ తల్లి జవాబుకెదురు చూడకుండానే ఆమె అక్కడనించి వెళ్ళిపోయింది.

ప్రభావతి ముందు అమలను పిలిచి బ్రతిమాలి 'సమాధానపరచి పంపుదామనుకుంది. అతడ్ని డబ్బు అడుగుదామనుకుంది ముందు. కాని, తర్వాత అప్పు డామెచేత అడిగించినా ఫలితముండదనే భయంచేత ఆ పని చేయలేకపోయింది. రేపు డబ్బు దొరక్కపోతే కుటుంబం ఏం కావాలి? ఆమె మెదలకుండా ఫూరుకొండిపోయింది.

# 8

ఆ రోజంతా అమల హృదయంలో లేచిన అగ్ని రగుల్కొంటూ వుంది. కాని, చివరికి వెనక్కు తిరిగి చూచుకుంటే తాను దేనికోసమై పోట్లాడిందో అదేదీ కనపడటంలేదు. ప్రపంచమంతా డబ్బుమయం, అదే బలవత్తరమైనటువంటిది. దానిముందు అన్నీ హీనమైనటువంటివి. తల్లి హృదయంకూడ దానిముందు తన ఓటమిని వప్పుకోవల్సిందే!...

జీవితంలో ఏలోటైనా భరించరానిదే. అందులో డబ్బులోటు మరీను. ప్రేమ, వాత్సల్యం, దయ యివేవీ లేకపోయినా సర్దుకొనిపోవచ్చు. కాని డబ్బు లేకపోతేమాత్రం సర్దుకుపోవటం కష్టం, కాదు కాదు అసంభవం. భర్తకు దూరంగా వుండగలిగి మూడేళ్ళు గడపగల్గిన అమల డబ్బులేకుండా మూడు రోజులుకూడ గడపలేక పోతోంది.

ఆకలి రాక్షసిలాంటిది. ఎప్పుడూ మనిషిని వెంటాడు తూనే వుంటుంది. దానికేమీ లేకపోతే చివరికి భూమికన్నైనా తింటుంది. అందుకే ప్రభావతి ఆత్మాభిమానంకంటే ఆకలికి ఎక్కువ ప్రాధాన్యత యిచ్చింది. అబ్బ! యీ యధవపొట్ట లేకుంటే ఎంత బావుండును!

ఆ పగలంతా తిరిగి తిరిగి ప్రొద్దుకూకిన కొద్దిసేపటికి ప్రమథ్ యింటికొచ్చాడు. ఓ అరగంట ఆగి అమల అతనిదగ్గర కెళ్ళింది.

అమలను చూడగానే – "ఇల్లూ అదీ చూచుకున్నాను, అమలా! ఇహ రేపే అక్కడికి వెళ్ళిపోతాను. ఇదిగో యిది మానిక్‌లాల్ ప్రో నోట్. దాని మీద జమవేసుకొని యిచ్చాడు. దీనిని బాబాయిగారికివ్వు. డబ్బుకేం తొందర లేదని చెప్పు. వుండప్పుడే యిస్తారు." అన్నాడు.

ఆ నోటువంక చూస్తూ – "ఒకవేళ డబ్బే యివ్వలేక పోతే?" అనడిగింది అమల.

"ఇవ్వలేక పోయినా ఫర్వాలేదు. నాకు అలాంటి బాధేమీ లేదు." అన్నాడు అతడు తన సహజ ధోరణిలో.

ఆమె అతని మొహం వంక చూస్తూ – "ఇంతత్యాగం దేనికోసం చేస్తున్నావు, ప్రమథ్‌దాదా! దీనికి బదులుగా నీవు ఏమీ పొందలేవు గదా!" అంది.

ప్రమథ్ నవ్వి నెమ్మదిగా – "నీవు నమ్మలేని మాటను నేను చెప్పినా ప్రయోజనం లేదు. ఊహా ప్రపంచంలో

విహరించే మనుషులు ఎంతమందిలేదు ? వారిలో నేనూ ఒకడ్ని.'' అన్నాడు.

ఆ మాటకేమీ జవాబివ్వకుండానే - "ఆ గొడవలో నన్ను పడెయ్యకు. ఆ విషయం ఏదైనావుంటే నాన్నతో చెప్పు ! ఇప్పుడు నిన్ను ఓ సంగతి అడుగుదామని వచ్చాను.'' అని అంది.

"ఏమిటో చెప్పు !'' అన్నాడు అతడు.

"నాకు డబ్బు కావాలి. నీవు యీ గొలుసు తీసుకొని డబ్బు యివ్వు. చాల అవసరం.'' అందామె.

"గొలుసు తప్పక పెట్టుకోవాల్సిందేనా ?" అనడిగాడు అతడు.

"అదిమాత్రం తప్పక చేయి. కాని అంతమాత్రం చేత నీ సహాయానికి విలువ కడతానని మాత్రం అనుకోకు !'' అంది ఆమె.

"ప్రపంచం నిజాన్ని గుర్తించలేని అమాయక స్థితిలో వుంది. నేను నిన్ను కృతజ్ఞురాలిగా చేసుకోగోరలేదు. కాని ఆ పని బాబాయితోనూ, మామ్మతోనూ చేసాను. వారు నాకు ఉపకరించే సాధనలుగా తయారయ్యారు." అన్నాడు ప్రమఫ్ చిన్నగా నవ్వుతూ.

అతడు డబ్బుతీసి ఆమె కందిస్తూ "అమలా ! ఒక్క మాట ! నీవు నన్ను ఎలా క్షమించావ్ ? ప్రపంచంలో డబ్బే శాశ్వతంకాదు. ఆ శాశ్వతమైన దానికోసమే వెతుకు తున్నాను." అన్నాడు.

"నేను నీ తప్పుని క్షమించటానికి రాలేదు, ప్రమథ్ దాదా! నా స్వార్థంకొద్దీ వచ్చాను." అందామె బొంగురు పోయిన కంఠంతో.

అతడు తలాడిస్తూ – "అలా ఎప్పటికీ జరగదు, అమలా నీ సంగతి నాకు తెలుసు. నీవు అంత బలహీనురాలవు కాదు. నీ దగ్గర ఎంత శక్తి లేకపోతే ప్రొద్దున అన్ని మాటలు అని యీ పూట మళ్ళీ నా దగ్గరకొస్తావు? ఈ పని నీవే చేయ గలవు." అన్నాడు.

అమల క్రిందకు చూస్తూ నిలబడివుంది. ఆమెలో ఉండి ఉండి ఒక్కసారి ఏదో ఆవేశం తన్నుకులాడింది. ఆమె శరీరం వణికిపోతోంది. గుండె దడదడ కొట్టుకుంటోంది.

ఓ సారి అతనివంక చూచి – "అవసరమైతే నా భారం తీసుకుంటావా, ప్రమథ్ దాదా?" అనడిగింది.

"అంటే ఏమిటో నాకర్థం కావటం లేదు."

"ఓ మనిషిభారం వహించగలవా, అని అడుగు తున్నాను. మంచీ, చెడూ, తిండీ, తిప్పలూ అంతా——"

"అలాగే! కాని నీవు ఏం చెప్తున్నావో...

"అవసరమైతే రేపురాత్రి నన్ను నీతో తీసుకెళతావా, అని అడుగుతున్నాను."

"బాబాయి ఒప్పుకుంటారా?" అతడు తన విస్మయాన్ని వ్యక్తం చేసాడు.

"వారి అంగీకారంతో కాదు, వారికి తెలియకుండానే వెళ్ళిపోవాలి. చెప్పు! ఏమంటావు?"

"తప్పక అలాగే! తీసుకెళ్ళటమే కాదు. ఎప్పటికీ..."

అతడ్ని మధ్యలోనే ఆపి – "ఇహ ఆ తర్వాత సంగతి చెప్పమాకు. అవన్నీ అనవసరపు మాటలు. రేపు నీవు వచ్చి కలుసుకో! అప్పుడు తేల్చి చెబుతాను." అని అందామె.

అమల మైకంకమ్మినదానిలా తడబడుతూ అక్కడ నించి వెళ్ళి పోయింది.

ఆ రాత్రి ప్రొద్దుపోయేవరకు అమల మంచం మీద పడి గిలగిల తన్నుకులాడింది. అందరూ పడుకున్న తర్వాత లేచి విజయనాథ్ కి ఉత్తరం వ్రాసింది—

"పూజనీయులగు మీకు,

అనేక వందనాలు.

నేనీ రోజున యింత యిరుకులో పడివుండక పోయినట్లయితే యీ జీవితంలోనే ఉత్తరం వ్రాయాల్సిన అవసరం వచ్చేది కాదేమో! ఇప్పుడు ఈ పరిస్థితిలో మంచీ – చెడూ, అవమానం, అభిమానాన్ని గురించి ఆలోచించటానికి అవకాశం లేదు. చాల ప్రమాద పరిస్థితిలో వున్నాను.

ప్రమథ్ నాకు దూరపు బంధువు. వారు మీతో కలుసుకున్నట్లు రెండు మూడు సార్లు మాట్లాడినట్లు చెప్పారు. ఆయనే నాకీ సంకట పరిస్థితి తెచ్చిపెట్టారు.

ప్రమథ్ దాదా అంటే నాకేం భయంలేదు. అపహాస్యం చేసి వారిని ఎదుర్కోగల శక్తి నాకువుంది. కాని, నా జీవితం నాకే భారమయ్యేట్లు పరిస్థితులు తయారు అయినై.

అతడు వుండవాడు. మానాన్న లేనివాడు. అతడు ఆయనకు కావలసిన ధనసహాయం చేసి గుప్పిటలో పెట్టుకున్నాడు. ఆ డబ్బు యిచ్చి పుచ్చుకోవటాలకు మధ్యస్థం నేను. నేను అడిగితే చాలు, అతడు డబ్బు మారుమాట్లాడక యిచ్చేస్తాడు. అందువల్ల నే నే మాటి మాటికి ఆయన్ని అడగాల్సివస్తోంది.

ఆ డబ్బు యివ్వటానికి వెనుక దాగివున్న చెడువుద్దేశ్యం నాకు తెలుసు. అమ్మకి తెలుసు. నాన్నకి తెలుసు. కాని, వారు చేసేది ఏం లేదు.

ఈ విధంగా వారు వివశులైన నన్ను అతనికి అమ్మేస్తున్నారు. నాకు యిది చాల కష్టంగా వుంది. ఇప్పటివరకూ నేను పవిత్రంగానే వున్నానని అందరికీ తెలుసు. అంత తేలికగా లొంగిపోననికూడ ప్రమథ్‌కి తెలుసు. కాని, యిప్పుడు చేస్తున్న పనికూడ తక్కువ హేయమైనదా?

ప్రమథ్ దాదా నామీద బలవంత ఏమీ చేయటంలేదు. అతడు త్యాగంద్వారా నన్ను ఎలాగైనా వశం చేసుకోవాలని చూస్తున్నాడు. కాని, దీనివల్ల ఒరిగే లాభమేంలేదుగదా! నరకానికెళ్ళే రోడ్డు వెడల్పుగా వుంటుంది. అంతమాత్రంచేత అది స్వర్గం కాదుగదా!

అతనికి మంచీ చెడూ, పాపమూ పుణ్యమూ, ఏమీ లేవు. చివరికి భగవంతుడుకూడ లేడు. నేను దానిని వ్యతిరేకిస్తున్నాను.

ప్రమథ్ దాదా నా పూర్తి భారాన్ని తీసుకోవటానికి సిద్ధంగా వున్నాడు. నా కోసం అతడెలాంటి త్యాగానైనా చేయటానికి సిద్ధమే ! ఈ విషయం నాకు బాగా తెలుసు. కాని, అదే నాకు ప్రాణంతో చెలగాటమైంది. నాకు ధర్మం వుంది. భగవంతుడు వున్నాడు. మంచీ చెడూ వున్నై. గౌరవమైన వ్యక్తి కూతుర్ని, గౌరవమైన వ్యక్తి భార్యను. ఐనా నా కీ మాటలన్నీ పడక తప్పటంలేదు.

ఈ పెనుగులాట నాకు ఏం బావుండలా. స్వర్గాన్ని వూహించుకుంటూ నరకాన్ని అనుభవించటమంత కష్టం మరొకటి వుండబోదు.

అందుకే యివాళ అన్నిటినీ త్యజించి మీ పాదాల సన్నిధికి వచ్చాను. మీరు నా కాశ్రయం యివ్వాలి. మీ భార్యఎడ మీకామాత్రం కర్తవ్యం వుంది. మీరు లేదనుకున్న నా నాశనానికి మీరే కారకులౌతారు. ఆ భారం మీరు వహించాల్సిందే !

నేను యివాళ రాత్రి సరిగ్గా పన్నెండు గంటలకి మీ కోసం ఎదురు చూస్తుంటాను. ఒక్క నిమిషం ఆలస్యమైనా నాకు దొరికేది నరకమే ! స్వర్గానికి ఎదురుచూస్తూ నరకంలో పడతానేమో ? నేది యెలా వుందో మనమేం చెప్పలేం.

నాకు ధర్మమంటే నమ్మకముంది. భగవంతుడంటే భక్తివుంది. మంచీ చెడూ జ్ఞానముంది. పాప పుణ్యాం భేదం వుంది. అందుకే యిప్పటివరకూ వీటన్నింటినీ సహిస్తూ వచ్చాను. మీరు నా ఆశల్ని నిరాశలు చేయకండి.

మీరు నా స్వామి, ఏ దాపరికమూ లేకుండా మీతో చెబుతున్నాను. జీవన్మరణ సమస్యను మీ చేతిలో పెట్టి హాయిగా నిద్రపోతున్నాను.

మీ పాదసేవాభిలాషిణి,
అమలాదేవి."

ఆ రాత్రి మూడు గంటలవరకు మేల్కొని రెండు కాపీలు తీసింది. ఒకటి తెల్లవారటంతోటే పోష్టులో పడేసి, మరొకటి పనిమనిషి చేతికిచ్చి బహుబజారు పంపింది.

ఆ సాయంత్రం ప్రమథ్ వచ్చి ఆమెను కలుసుకున్నాడు. అమల ఆ రాత్రి పన్నెండు గంటలకి ఆమెకోసం ద్వారందగ్గర ఎదురుచూస్తూ వుండమని చెప్పింది.

ప్రమథ్ ఉల్లాసంతో - "తప్పక వస్తావుగదా ?" అనడిగాడు.

"అవసరమైతే తప్పక వస్తానని చెబుతున్నాగా?" అంది ఆమె ఆరక్తమైన మోహంతో.

"సరే. అలాగే అప్పుడు నీ కోసం ఎదురుచూస్తూ వుంటాను." అనిమాత్రం చెప్పాడు. ఇంకేం చెప్ప సాహసం చేయలేక పోయాడు.

*　　*　　*

"అక్కా! నీవు కాస్త వచ్చి క్రిందకు దించు!" అన్నాడు విజయనాథ్ కారు ఆగటంతోటే దగ్గరలో నిలబడి తమకోసం ఎదురుచూస్తున్న వినోదినిని.

అప్పుడే ముందుకు వస్తున్న వినోదిని అతను చెప్పటం పూర్తి చేయకముందే - "రా! అమ్మా రా! ఇది నీదీదీ యిల్లన్నసంగతి నీకు గుర్తు వుండివుంటుంది. ఒహాటీ రెండు సార్లు వచ్చావుకదూ?" అంది ఆహ్వానిస్తూ.

ఆమె ఎక్కడి కొచ్చిందో అప్పుడుగానీ తెలియలా ఆమెకు. రెండు చేతులు జోడించి నమస్కరించి పాదాలు తాకింది.

వినోదినీ భర్త వ్రజవిలాస్ మెట్లమీద నిలబడి ఇదంతా చూస్తున్నాడు. అమల వారికి నమస్కరించింది. ఆయన సంతోషంతో వుప్పొంగి పోతూ - "బలేపని చేసావమ్మా! నీ వుత్తరం చూచి యెంతో సంతోషించాను. నీ సమయ స్ఫూర్తికి మెచ్చుకున్నాను. నీ లాంటి వాళ్ళు నల్గురున్నా చాలు! చెడిన సంసారాలు కుదుటపడతై. మిమ్ముల్ని ఆహ్వానిస్తున్నాను. మీ ఆనందంలో మమ్ముల్ని కూడ భాగస్వాములు కానీయండి." అన్నాడు.

ఆయన మాటలు వింటూ అమల కళ్ళవెంట కన్నీరు పెట్టుకుంది. విజయనాథ్ కూడ సజల నేత్రాలతో ఆయన వంక ఓ సారి చూచాడు.